శ్రీ శివాయగురవే నమః

# శ్రీరామకథాఽమృతము

## అరణ్యకాండము.



బ్రహ్మశ్రీ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారిచే
రచియింపఁబడి







వారి పుత్త్రుఁడగు
రాఘవనారాయణశాస్త్రిగారిచే
ప్రకటింపఁబడియె.

నిడుబ్రోలు:
తాతా ముద్రాక్షరశాల యందు
ముద్రితము.

 1935. [వెల రు 3-0-0

# ని వే ది క.

క॥ తతరామకథా౽మృతమునఁ, దృతీయమగుసంపుటంబి ♦ దియునొ్గిముద్రా
పితమయ్యెదీనవస్మ, త్పితృపాదుల చిత్తమునకుఁ ♦ దృప్తికలుఁగుతన్. ౧

క॥ కాలస్థితిఁబట్టియునే, నీలోనొ్నరించినట్టి ♦ ఋణమట్టులుంటన్
నాలుగవుసంపుటమ్మున, కాలస్యమ్మగునునాలు ♦ గైదునెలలొ్గెన్. ౩

క॥ మీతఱిఁదోడ్పడిమెదమని, నాతరమునఁదప్పకున్న ♦ నరవరులనునే
నీతూరిసంపుటమ్మున, ఖ్యాతులనొ్నరింతువిడుతు ♦ నవములగొ్డవల్. ౪

క॥ సత్యప్రతిజ్ఞుఁడనయని, తుత్యయమేనాఁడులేని ♦ యచ్చటుజేరన్
బ్రిత్యయమునమెట్టెక్కుమ, పత్యముఁగనినట్టిఫలముఁ ♦ బడయుమతండ్రీ. ౧

క॥ కృతిపతిపరమేశానుఁడు, కృతివర్ణితయశులుజాన ♦ కీరఘునాథుల్
కృతిహేతువులలశివులుం, గృతికర్తజనకుఁడునన్నుఁ ♦ గృతిఁజేయరెటుల్. ౫

ఇట్లు,
తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి.

ఉ॥ ఆదిమకాండమంతమగు నంతకునెంతయొసంతసంబున
స్మిదగు భాతికాకృతియ నేత్రసుపర్వమొనర్చుచుండె నీ
మీఁదటికాండముల్భవదమేయశరీరము భావబద్ధమ
ర్యాదముఁజూపునింకఁగృత రామకథా౽మృత సద్గురూత్తమా.

శిష్యుఁడు,
పరిమి వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి,
చందవోలు.

—•♦•—

శ్రీశివాయగురవేనమః

# విషయసూచిక.

———-o———

# శుద్ధాశుద్ధపత్రిక.

| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 10 | చులక | చుల |
| 8 | 5 | వెడ | లెడ |
| ,, | 24 | నావు | నీవు |
| 9 | 16 | నెక్కను | నెక్కొను |
| 15 | 28 | యప్రి | యమప్రి |
| ,, | 29 | వవ | వన |
| 16 | 25 | దయ్యా | దయ్యా |
| 17 | 30 | యుసే | యునే |
| 29 | 27 | విశ్వ్రీ | విశ్వ |
| 36 | 8 | బుప్రి | బుంబ్రి |
| 39 | 15 | పూజా | పూజా |
| 44 | 8 | బిదన | బిదప |
| 46 | 28 | సూఖా | సుఖా |
| 51 | 19 | నెమ్మె | నెమ్మై |
| 53 | 26 | పూటు | పూటి |
| 56 | 25 | అత | ఆత |
| 65 | 20 | కంజ | కజ |
| 71 | 15 | బంత | బలం |
| 79 | 21 | గచ | కచ |
| ,, | ,, | కమ | గమ |
| 104 | 26 | నిశ్చ | నిశ్చి |
| 110 | 2 | లకు | లకు |
| ,, | 20 | దనపు | దనుపు |
| 151 | 30 | ముజ | ముజ్జ |
| 157 | 6 | కేల | కెల్ల |
| 148 | 19 | వక్రి | వక్త్రి |

# ప్రకటన.

—o—

శ్రీరామకథామృతగ్రంథమాల.

ఇందు శ్రీరామకథామృతమను గ్రంథరాజము ప్రధానమగుట దీనికీనామ ధేయముకలిగెను. తద్గ్రంథరాజము వాల్మీకి రామాయణమెల్ల గ్రహించి యధ్యాత్మ రామాయణానుసరణమున శ్రీరామునియందుఁ బరతత్త్వమును సమర్థించుచు భక్త్యావేశము శ్రావక శ్రోతృజనంబులకు మిగులనుట్టిపడ ప్రాచీనకవిత్వఫక్కికతోఁ బ్రణయింపఁబడియె. నయ్యది ప్రశస్తములైన పత్రములమీఁద ముద్రించి యయిదు సంపుటములుగ నేర్పరుపఁబడుచున్నది.

ఆగ్రంథముతోడ మఱికొన్ని తత్కవికృతములగు కృతులును నిఁకఁగొన్ని తత్పుత్ర విరచితములును మొత్తము పదిపొత్తము లీగ్రంథమాలయందు వెలువడును.

ఇరువదిరూప్యములు గ్రంథదిదృక్షచేఁగాని గ్రంథోద్ధరణబుద్ధిచేఁగాని సమర్పించువారలకుఁ బైగ్రంథమాలయందు ముద్రితములగు పొత్తములెల్లఁ బ్రత్యర్పితములగును. కేవలప్రధానగ్రంథమును మాత్రమపేక్షించినఁ బదేనురూప్యములు మాగ్రంథమాలకు సాయ్యమొసర్పవలయును. బుధులిద్దాని సంగ్రహించుకొనుట యందు సాదరులయ్యెదరుగాత.

వలయువారు :—

తాడేపల్లి బాలకోటీశ్వరశాస్త్రి.

చందవోలు,

గుంటూరు మండలి.

అనికాని —

తాడేపల్లి సత్యనారాయణశాస్త్రి,

నిడుబ్రోలు,

గుంటూరు మండలి.

అనికాని వ్రాయవలయును.

శ్రీ శివాయగురవే నమః

# శ్రీరామకథామృతము

## అరణ్యకాండము.

---

### ప్రథమాశ్వాసము.

---



మద్బృహదారణ్యక
సీమామహిమాధ్యమాని ♦ సేవితపదవీ
భూమానందరసోజ్జ్వల
ధామాక్షరతత్వదీప ! ♦ తాత్త్వికరూపా ! ౧

ఆ॥ అవధరింపు మట్టు ♦ లాసతి వేఁడంగఁ, గూర్చఁ దొడఁగెఁ బతియుఁ ♦ గూర్చువచన
రచన దాత్తఁ దేనె ♦ రహి రాముచరిత మూ, టించి మేలిరుచులఁ ♦ నించుచుండ.

క॥ మహిళావతంసమా విను, మహిరాజశయాను చరిత ♦ మమృతభరిత వా
నహ మనుచు జరామృత్యువి, రహముం బొనరించు నమ్మి ♦ రహి సేవింపన్. ౩

—♦ శ్రీరాముఁ డత్రిమునివల్ల సెలవుఁ గొనుట ♦—

ఉ॥ ఆమెయి నత్రిమౌనిమహి ♦ తాశ్రమసీమను నాఁటిరాత్రియున్
రామయుఁ దమ్ముఁడుం గొలువ ♦ రాముఁడు రాణ దలిర్ప నిల్చి సు
త్రామనుతుండు ముచ్చటలఁ దద్దయుఁ దేలుచు వారిఁ దేర్చుచున్
శేముషి వొంగ వేఁకువయుఁ ♦ జేరఁగ రాఁ గృతనిత్యకృత్యుఁడై. ౪

క॥ అమ్మునిఁ గొలిచి వికాసం, బిమ్మున వెలయంగ నిలిచి ♦ యిట్లనె మహితా
ర్థమ్మునఁ గల వల నరసితిఁ, జు మ్మోవిదితాత్మ ! నీదు ♦ సూక్తులకతనన్. ౫

ఆ॥ మౌనివర ! తపస్వి ♦ మండలమండితం, బై పొసంగు దండ ♦ కాటవిని వ
సింపఁ దలఁచినార ♦ మింపుమై సెల విడి, దారి సూప శిష్య ♦ తతిఁ బనుపవె. ౬

క॥ అనిన విని యల్ల నవ్వుచు, ననఘా ! సెల విడితి మున్నె ♦ యఖిలంబునకున్
జననియు జనకుఁడు నను నడి, విని కని యనువారి కెల్ల ♦ వివరముతోడన్. ౭

క॥ అందఱకు దారి సూపఁగ, నందితి వీలీలఁ బుట్టు ♦ వనవద్యగుణా
ముందుఁగని దారి యిది యని, యెం దెనయని చోటు చెల్వ♦నిం దొకఁ డున్నే.

ఆ॥ కా దనంగ నేల ♦ కల్యాణగుణధామ, రామ ; నిన్నుఁ బెరసి ♦ రాఁగఁ దొంటి
నోము లెన్ని గలవొ♦యామెయివా రెల్ల, వత్తు రనుచు వారి♦వలనుఁ గాంచి. ౯

క॥ ఆదేశ మొసఁగె నటఁజని, యాదేశముఁ జేర ననిచి ♦ యరుదెంచు తదీ
యాదేశమె శ్రుతి యనెడు శ్రు, తాదేశము మఱవవలవ ♦ దని ముని గిరిజా. ౧౦

ఆ॥ అనుమతింప వారి ♦ నందఱఁ దోడ్కొని, సామయికకలాప ♦ సంగ మొలయ
నరిగి యొడయఁ డెలమిఁ♦నామంత్రణము సేయ, నాశ్రమంబు సేరె♦నతఁడతంద్రి.

—♦ అత్రిమహాముని శిష్యుల రామునికి త్రోవఁజూపం బంపుట ♦—

క॥ మునిశిష్యులు తోడనరా, మునిపూజితుఁ డట్లు మోద ♦ మునఁ జని యొక్కం
డనుపమవాహినిఁ గని యి, ట్లనె ననితరగుణుఁడు రాముఁ ♦ డవ్వారలతోన్. ౧౨

ఆ॥ దీనిఁ గడచు తెఱవు♦దెలుపుఁ డియ్యాపగ, యాపగేంద్రుఁ బెరయ♦నై సమృద్ధి
వఱలుచున్నయది య ♦ వారణవారణ, ములకునైనఁ దెరువు ♦ మొనయరాక.

క॥ అని పలుక వారు సంతస, మునఁ బొదలుచు లోకనాథ ; ♦ మునివంద్య; యదే
తనరెడు నౌక సుదృఢ యం, దనువుగఁ గూర్చుండుఁ ♦ డౌదు మవ్వలఁ జేర్పన్.

మ॥ అన నవ్వారలు ముప్పురున్ విధిఁ బ్రయు ♦ క్తాచారులై యోడ నె
క్కిన వాచంయమచంద్రశిష్యులు ప్రిస ♦ క్తిం జేర్చి రక్కూల మా
ఘనుఁ జేరొక్కన్న జనౌఘ మా తెఱఁగున ♦ న్గాసంసృతిం దాఁటి యి
మ్మెనయం గాంతు రటన్న నౌను నలినా ♦ క్షీ ; వారి మే లెట్టిదో. ౧౫

క॥ కనెఁ దాపసపదపాండల, మినవంశవిభూషణంబు ♦ హేలావతితోఁ
దనతమ్మునితో నటఁజని, మునివటులం బనిచి మోద ♦ మున జీవమణీ. ౧౬

ఆ॥ సూర్యమండలమ్ము ♦ సొచ్చి వెల్వడు నట్టి
మేటితేజ మచట ♦ మేల్మి నూప
వింత యగుచు నెగడు ♦ విధ మెఱింగిరి వారు
బ్రాహ్మలక్ష్మి యనుచుఁ ♦ బ్రథితవిభవ

— ♦ రాముఁడు తాపసాశ్రమముఁ బ్రవేశించుట ♦ —

సీ॥ ఆశ్రావయ ముఖోక్తు ♦ లభ్యాస మొనరించి, పలుకు శుకాదుల ♦ పలుకుబడులు
నిత్యసేవాగతా ♦ నిమిషాంగనాబృంద, మంగళగీతికా ♦ మంజిమములు
బలిహోమసంప్రీతి ♦ పన్నయాజకక్లృప్త, సామవాదాత్మప్ర ♦ సాదనములు
స్వాధ్యాయగోష్ఠులఁ ♦ జర్చించు సద్బ్రహ్మ, చారుల బ్రహ్మఘో ♦ షప్రసక్త
లోకమొగి శ్రవణానంద ♦ మొలయఁజేయ
సత్యలోకంబె యిదియు ని ♦ స్సంశయముగ
ననుచు రాముఁడు ధనువు వి ♦ జ్యం బొనర్చి
యందుఁ జొరఁబాఱె నిత్యశు ♦ ద్ధాంతరంగ. ౧౮

ఆ॥ సర్వలోకభూత ♦ జాతశరణ్యలు, కుశసమిత్ప్రశస్తి ♦ గుంభయుతలు
వేదవేదికాని ♦ విష్టలు సంమృష్ట, చత్వరలుగఁ ♦ బర్ణశాల లొప్పె. ౧౯

క॥ మౌనికొనల నసియాడుచు, జానగు ఫలపుష్పములకుఁ ♦ జా టొనరింపన్
బూనినగతి యన కనియెడు, మానితవల్కలము లధిపు ♦ మలయించె నుమా!

క॥ వేర ముడిఁగి యొం డొంటిం, దోరముగాఁ జెరసి తిరుగు ♦ ధూర్తమృగపశు
స్వైరసికతఁ గని మెచ్చిరి, ధీరతములు వార లిమ్ము ♦ తీ రని సుదతీ! ౨౧

క॥ అచటి తపస్స్వాధ్యాయ, ప్రచయం బయ్యజ్ఞమూర్తి ♦ భావంబున స
ర్వచరాచర సంతుష్టిం, బచరింపం జాలు ననఁగఁ ♦ బరఁగె సురాజ్ఞీ! ౨౨

క॥ మెచ్చుచు వార లెనయుచో, వచ్చిరి తాపసులు భాను ♦ వైశ్వానరభా
భ్యుచ్చయులు తా రొనర్చిరి, హెచ్చుగఁ బాద్యాదికార్చ ♦ లిందునిభాస్యా!

ఆ॥ సకలలోకహితుఁడు ♦ సర్వాత్ముఁ డగు రాము
పాదపద్మములకుఁ ♦ బ్రణతు లగుచుఁ
బావకోపములు ప్ర ♦ వర్తిఁ దజ్జలము గ్ర
హించి రెట్టిపదవి ♦ నెంచిరో కొ.. ౨౪

తే॥ ఆంతరజ్ఞానసంపన్ను ♦ లామహాత్ము, లాహరి సమభ్యుదితు విధు ♦ నట్లు సీత
లక్ష్మిగా శేషభూతుఁగా ♦ లక్ష్మణుని ద, లంచి సుప్రీతు లైరి వి ♦ రించివినుత

ఆ॥ రూపసంహననని ♦ రూఢిసౌహార్దమా, ర్దవసుసౌమ్యవేష ♦ తలను రాము
నందుఁ గాంచి తపసు ♦ లాశ్చర్యరసమగ్ను, లైరి నిర్నిమేషు ♦ లయిరి సుదృశ!

క॥ అందఱుఁ గొని చని విడుదుల, యందు నిలిపి రామదేవు ♦ నభ్యంతరశా
లం దేవపీఠమున నిడి, పొందుగ నిట్లనిరి మునులు ♦ పురుహూతనుతా! ౨౭

— ♦ మునులు శ్రీరామునిఁ బూజించుట ♦ —

చ॥ ఇవె ఫలపుష్పమూలతతు ♦ లియ్యవె మేలికొలంకు లాకుటిం
డ్లివె యవె పువ్వుటీరములు ♦ నీయవె యాశ్రమభూము లిన్నియుఁ
న్నవవిదితంబులే భువన ♦ నాయక! నీయవె కావె యొడ్ల మే
మవుదుమె భార మన్యులదె ♦ సాదరత న్నము నిచ్చ లోమఁగన్. ౨౮

ఆ॥ లోకు లెందు నృపులు ♦ లోకపాలాంశచే, నర్థిఁ బ్రోవ జన్మ ♦ మందువార
లందు రంతెకాక ♦ యఖిలేశుఁడవ యిట్లు, జనన మంది తీవు ♦ జన శరణ్య!

క॥ గురుఁడవు దండధరుఁడ వీ, శ్వరుఁడవు నవు నీవు ధర్మపాలుఁడ వన నా
గరుఁడవుగా నేమి విపిన, చరుఁడవు గా నేమి సకల ♦ సంయమివంద్యా! ౩౦

క॥ పతి వీ వని నీదెస శా, సితి బలువిడి యొండు మఱచి ♦ జితకామక్రో
ధత గర్భభూతులమకా, గతి వేఱొకఁ డగునె మమ్ముఁ ♦ గావఁగ దేవా! ౩౧

తే॥ త్వద్విషయవాసులగు జను ♦ ల్తావకీను
లింతయును నీకు విషయంబ ♦ కొంత యనఁగ
నేల యస్మత్కృతార్చన ♦ లెనసి చూడ్కి
మాదెసఁ బొసంగ మమ్మేప్తు ♦ మనువుమయ్య! ౩౨

మ॥ అనుచున్ గన్నుల హర్షపూర మొలుకన్ ♦ హాయిం గనం గంటె మం
చనవద్యు ల్మును లమ్మహామహున క ♦ ర్ఘ్యార్చల్ పొసంగించి ర
వ్వనితారత్నముతో సహోదరునితో ♦ వా రిచ్చు సత్కారముల్
గొని మెచ్చె న్రఘురాముఁ డందఱ సుధా ♦ కుల్యావిహారోచితా! ౩౩

తే॥ అమ్మెయినిఁ బ్రితిగృహము పర్ణ ♦ శాలాశ్రమంబు
గాఁ గలుగుచోటు లన్నియుఁ ♦ గలయఁ గాంచి
యాదరం బొప్ప నవ్వారి ♦ కథయ మొనఁగి
పొంటి కచ్చో నిలిచె లోక ♦ నాథుఁ డజిత! ౩౪

క॥ భానునిభుఁడు భానూదయ, మా నాలో మేలుకాంచి ♦ యభ్యుదితమహా
శ్రీ నలరి కాల్యవిధుల, న్మానుగఁ బొనరించి మాని ♦ మండలి పొదువన్. ౩౫

తే॥ వారి నామంత్రితులఁ జేసి ♦ వార లనుప
నమ్మహారణ్యమార్గమ్ము ♦ నధిగమించి
యనుజుఁ గనుఁగొని రాముఁ డి ♦ ట్లనెఁ దదీయ
గర్భమునఁ జొచ్చుతఱిఁ జిద్వి ♦ కాసమహిత ! ౩౬

మ॥ ఇది ఘోరం బెడయాని వృక్షములతో ♦ సింహామృగవ్యాఘ్రము
ఖ్యదురాసాద సమస్తజంతుతతితో ♦ గ్రవ్యాదనవ్యాధనం
సద నిత్థంవిధభావవర్తనలతో ♦ సన్మార్గగమ్యంబుగా
క దెస ల్గ్రిమ్మి నిరాకరించెడు స్వ ♦ దార్గత్యైకమత్యంబునన్. ౩౭

ఆ॥ కాన దృఢవివేక ♦ మూని సంసృతి నట్లు, దీన మెలఁగవలయు ♦ దీప్తశరుల
మగుచు మనకు నడుమ ♦ నవనిజ జీవేశ్వ, రాంతరస్థమాయ ♦ యనఁ బొసంగ.

మ॥ అనిభాషించుచు సార్ధయోజనము వా ♦ రధ్యోజనం దిట్టలై
చని కల్హారమహోత్పలోత్పల వన ♦ చ్ఛాయాప్తిసుప్తాచ్ఛహం
సనిరాతంకరసాఢ్య యౌ సరసి నో ♦ జం గాంచి కాంచీనితం
బనికాశాంచితచక్రసైకతతల ♦ ప్రాకామ్య మీక్షించుచున్. ౩౮

—♦ సీతారామ లక్ష్మణులకుఁ ద్రోవలో విరాధుఁ డగపడుట ♦—

ఆ॥ చేరనరిగి తారు ♦ తీరమ్మున జలావ, తార మొనసి శుద్ధ ♦ తమము జలముఁ
గ్రోలి తనిసి సమను♦కూలతరుచ్ఛాయ, మొనసి సేదఁ దేర్చు♦కొనుచు నుండ.

సీ॥ కొన్ని మానిసిపీనుఁ♦గుల గ్రొచ్చి యెత్తిన, పెనుశూల మొకఁ డంస♦మున నమర్చి
శార్దూలమహిషాది ♦ జంతుసంతానంబు, గుదిగూర్చికొని చేతి ♦ కొనకుఁ దార్చి
నమలి యుంచిన యాంత్ర♦నాళమ్ము మొత్తమ్ము, నమియు నౌద్ధత్యప్ర♦యుక్తిఁ బేర్చి
దంష్ట్రిల నొక యట్టఁ♦దాటించి రస మాని, తలయెమ్ములును బెడ♦తల వెలార్చి
మిత్తిపై మిత్తి యిది యన ♦ మేను వెంచి
యట్టహాసంబు లెడనెడ ♦ నాశ లెడలఁ
జేయ మిడిగ్రుడ్లు మిణుఁగురు ♦ లెసదర డాయ
వచ్చె నొక పెద్దరాకాసి ♦ వారి గూరి ! ౪౧

క॥ వానిఁ గని రామచంద్రుం, డానెఱిఁ దనయనుజుఁ గాంచి ♦ యన్నా ! యదె స్వ
ర్భానుపగిది నరుదెంచెడుఁ, దా నలతిం బోఁడు వీఁడు ♦ దాఁకెడుఁ బెలుచన్.

ఆ॥ ఎదిరిమేలె యెడద ♦ నిడు మనబోంట్లకుఁ, దప్ప దిట్టి కష్ట ♦ దశ యొకప్డుఁ
గపట మెంచువారి ♦ గతికిఁ దోఁ డగు విధి, యెప్పు నప్రమాద ♦ యుక్తి తమకు.

కం॥ మెలఁకువ మెలఁగు మొకఁట నే, యలఁతం బాటింపకుము దు ♦ రంతుని వీనిం
బొలియించు నెటేఁ దలఁపు మి, య్యిలాసుతం దేర్పఁ బ్రోవ ♦ నేమఱకు మిఁకన్.

కం॥ అని జనకనందినిం గని, యనఘమతీ! నీవుఁగల్కి ♦ మందక నిలువం
జను నన లక్ష్మణుఁ డిట్లనె, మనువంశభవప్రధాన ♦ మణితో రమణీ!

ఆ॥ అన్న! తలఁకు గలదె ♦ యానాఁటికోపంబు, దొనుకుచున్న దివుడు ♦ దొసఁగువీని
పైని నున్నయంత ♦ పరఁగించువాఁడ నీ, తగినప్రాభవమునఁ ♦ దారసిలుము.

—♦ శ్రీరామ విరాధ సంవాదము ♦—

మ॥ అనుచున్ వా రెదిరింప నున్నతటి వాఁ ♦ డామృత్యు వామాంసభో
జనుఁ డాచెట్ట యుగాంతభైరవసమ ♦ స్యం బ్రోద్ధతారావగుం
భనవోల్లాసము భీషణంబుగఁ దనర్పం ♦ దోన త్రోఁతెంచి యి
ట్లనె రామాధిపుఁ గాంచి పెల్చనఁ గలా ♦ వ్యాసంగవశ్యాత్మికా! ౪౮

ఆ॥ మీర లెవ్వ రేమి ♦ మెయి నిట్టు లిక్కోన, జొచ్చినార లింత ♦ సొబగుకాండ్రు
కాలమృత్యు విచటఁ♦గాన్పించె నీఁకఁ దల, దాఁచికొనఁగఁ దగిన♦తావు గలదె.

ఉ॥ నాతి యొకర్తు తో నడువ ♦ నారలచీరెలు గట్టి పెంజెడల్
బ్రాఁతిగఁ జుట్టి వి ల్లొకఁడు ♦ పట్టకపట్టి యరణ్యసీమల
న్నీతియె యిట్లు మెట్టుటయు ♦ నేస్త మొకించుక జీవితేచ్ఛతో
నేతఱేఁ గల్గదో వెడఁగు ♦ లిప్పటి కైతిరో మాట లేటికిన్. ౪౯

కం॥ మెత్తని కబళము లీక్రియ, హత్తించిన విధిన పొగడ ♦ నగు నా కిఁక మీ
రి త్తరుణి నొసఁగి పోదురో, యిత్తురొ మీ దేహములను ♦ రహిం న్మొత్తముగన్.

ఆ॥ తెలుపుఁ డనిన నిట్టి♦తెఱవు తెక్కలికాఁడ, వెవఁడ వోరి! నోటి♦కెక్కనాని
కాఱు లఱచెదవు వి♦కారమ్ము లిన్నియుం, జక్కపఱుతు నింక♦జక్కనిలుము.

ఆ॥ భానువంశజులము ♦ పఙ్క్తిరథాత్మజ, న్మూలము తండ్రి యాజ్ఞ ♦ మునులు కోర
నిన్నుఁబోఁటివారి ♦ నేలకుఁ గోలకుఁ, దేర నిచటు ద్రొక్కి ♦ నార మనిన. ౫౨

కం॥ రాముని మినుకుల కులుకుచు, నేమేమీ యింతపనికి ♦ నీ రరు దేరం
గామితములు నెర వేరవె, హా మలుకు నె కప్ప నోటి ♦ పలుకుబడులకున్. ౫౩

కం॥ పేరు విరాధుం డందురు, నేర మనక మునిజనముల ♦ నెత్తురుగోలం
గా రావు లేకె మెలఁగెద, గారామునఁ గన్నవారి ♦ కలిమి వెలయఁగన్. ౫౪

తే॥ ఆశతక్రోద జననివి జ ♦ యాహ్వయుండు, జనకుఁ డే బ్రహ్మవరశక్తిఁ ♦ జావు లేని
వాఁడనై వాడవాడల ♦ వరుసఁ బెట్టి తిరుగుచున్నాడ బలయుక్తి ♦ తేటపడఁగ.

క॥ మున్నే తెలిపితి వినరో, కన్నియ నిడి చనుఁ డటంచుఁ ♦ గాదన కేలా
తిన్నని నుడు లాడఁగఁ దన, కిన్నెలఁతఁ గొనంగ ననుచు ♦ నెత్తిన కినుకన్. ౫౬

ఆ॥ కువలయాక్షి నొడిచి ♦ కొని పోవ నుంకింప, నామె చెదరి కురరి♦ యట్లెలుంగు
సూప రాముఁ డడరి ♦ సునిశితశరములు, గ్రొచ్చె వాని మేను ♦ వ్రచ్చి చనఁగ.

—♦ రామలక్ష్మణులు విరాధునితోఁ బోరుట ♦—

ఉ॥ దానికిఁ గోపగించి వసు ♦ ధాసుత డించి విదీర్ణజంతు సం
తానవసాంత్రనాల ముప ♦ దంశితమానికపాల మగ్ర సం
దానితవైరివీరజన ♦ తాశవజాలము శూల మెత్తి య
ద్దానవుఁ డేగుదెంచె హరిఁ ♦ దాఁకి జయించెద నంచు నుగ్రతన్. ౫౮

క॥ దాశరథు లిరువు రాదు, ష్టాశరు తలఁ పరసి కదిసె ♦ నంతకుఁ డని శా
తాశుగముల ముంచి రనీ, కాశప్రతిభావిశేష ♦ కలన దలిర్పన్. ౫౯

క॥ జృంభించిన వాని సమా, రంభంబున మేన నుండి ♦ రాలెఁ దెరలి యా
దంభమున దైత్యుచే టనఁ, గుంభినిఁ బడు నుల్కలనఁగఁ♦గొనకొని ములుకుల్.

అ॥ అస్త్రవిదుఁడు రాముఁ♦ డయ్యాగడం బెంచి, బాణయుగ్మమున వి ♦ భాసురమున
నసుర చేతి శూల ♦ మాఱడివోవ ఖం, డించి వైచె సురలు ♦ మించి పొగడ.

ఆ॥ కులిశసార మదియుఁ ♦ గూలె వజ్రాహత, మైన మేరుశిఖర ♦ మట్లు వహ్ని
కీల లాకసమున ♦ గిరికొని తోడ్తోన, వ్రాలెఁ బుడమిపైన ♦ రాలకేశి. ౬౨

—♦ విరాధుండు రామలక్ష్మణుల నెత్తికొని పోవుట ♦—

క॥ తెరలక పై కుఱికెడు నా, సురు బాకుల గ్రొచ్చి రంత♦ సొలయక వాఁ డ
య్యిరువుర మూఁపున నిడికొని, సరభసుఁడై పఱచె నబ్జ ♦ జాతసమాస్యా!
ఆ॥ సీత చెన్ను దొఱఁగి♦ జేజేలకును మ్రొక్కెఁ, దొడరె దనుజనాథ! ♦విడువు మనుచు
వేఁడె వాని మోడి ♦ వీడ కవ్వారిఁ గొం, పోవుచుండె వాఁడు ♦ పుణ్యచరిత! ౬౪
క॥ ఓడకు మిదె మే లని సై, దోడున కెఱఁగించి విభుఁడు ♦ ధూర్తుని భుజ మ
ప్డూడఁ బొడిచె ఖడ్గంబునఁ, దోడన జో డడఁచె నొండు ♦ దొలఁగ సుశీలా!
ఆ॥ పుడమి నిలిచి రంతఁ ♦ బోక వాఁ డడరి రా, నఱికె నొక్కదొడ్డ ♦ నారసమునఁ
దత్పదద్వయమ్ము♦దయితుండు భూజయు, సురలు భువిని దివిని♦జొక్కి పొగడ.
క॥ ఱాలు నులియ వాఁ డవనిం, గూలియుఁ బొలియకయ గొండ♦గుహఁ బోలిననో
రాలలితుల మ్రింగ నెటో, పోలు ననుచుఁ దెఱచి నేలఁ ♦ బొఱలె ధుతారీ!

ఆ॥ వీఁ డవధ్యుఁ డనుచు ♦ విశ్వాత్ముఁ డవ్వానిఁ, గాలఁ జేత నులుమ ♦ గా సుమిత్ర
పుత్త్రు మల్లు చేయఁ♦బొలిసియుఁ బొలియంగఁ, బోక వదరుచుండ♦బుద్ధిఁ దలఁచి.

—♦ రామలక్ష్మణులు విరాధుని గర్తమునఁ బూడ్చుట ♦—

క॥ మెడఁ ద్రొక్కి కంఠనాళము, వెడలించుచు గర్త మిప్పు ♦ డే త్రవ్వినచోఁ
బడవైతు మనిన ననుజుఁడు. కడునిడు పగు నొక్క కంద ♦ కం బొనరించెన్. ౧౯

క॥ అం దారక్కసు మే నిడి. పొందామరబొడ్డువేల్పు ♦ పూరించె శిలల్
పొందించె లక్ష్మణుం డట, బృందారకకుసుమవృష్టి ♦ పెనుపొందెఁ జెలీ! ౨౦

ఆ॥ సీత చేర వచ్చి ♦ చేచేత మగని నె, మ్మేను నిమిరి వక్ష ♦ మూన బిగ్గఁ
గౌఁగిలించి మఱఁదిఁ ♦ గాఁగలవాఁడవ, పో యటంచుఁ బొగడెఁ ♦ బుష్పగంధి!

—♦ విరాధుండు దివ్యపురుషుఁడై రాముని వినుతించుట ♦—

క॥ ఆదనుజు మేను వెలువడి, యాదటఁ బలుతేజ మొక్క ♦ యంబరచరుఁడై
మోద ముదంచితముగ సీ, తాదయితుం జేరి నిలిచెఁ ♦ దాత్పర్యమునన్, ౨౧

క॥ అంబరమణిడంబు విభూ, షాంబరముల యింబు సుంద ♦ రాకారంబున్
శంబరరిపు మార్చున యా, డంబర మిది యనఁగ నయ్యె♦డం బొడసూపన్. ౨౩

క॥ అందఱు వానిం గనుఁగొను, చుం దనరెడు ముదము తోడి ♦ చూపున నిలువన్
డెందము రామపదాబ్జం, బిందిర మై నెగడుగను ధృ ♦ తిం బరవశుఁడై. ౨౪

ఆ॥ ఆనతార్తిహరు ద ♦ యాకరు నాభవ, బంధమోచనైక ♦ బంధు రామ
చంద్రుఁ జక్కఁ గాంచి♦సాగిలపడి మ్రొక్కి, దోసిలొగ్గి పలుకు ♦ దొట్రుపడఁగ.

తే॥ పలికె శ్రీరామ! సంపుల్ల ♦ పద్మనేత్ర!
మహితసర్వాంగసుందర ♦ మంగళాకృ
తీ! జనించితె నన్నుఁబోఁటి ♦ తెఱఁగుమాలి
పడెడు తోడుసులఁ గావ నె ♦ పమ్ము నెఱయ. ౨౬

క॥ కానని వారలఁ గానవు, కానని కా న్వనసినావు ♦ కానల మెలఁగం
గా నని వార్యత మెయికొన, గా ననిచితి మంచిచెడ్డ ♦ గని పాలింపన్. ౨౭

ఉ॥ ఏనును దేవసంభవుఁడ ♦ నే యయి తుంబురుసంజ్ఞ యొప్పఁగా
జానగు తీరుఁ దేజుఁ దగఁ ♦ జారుశరీరుఁడనై మదంబునన్
జాన నొకర్తుకం గొని వి ♦ చారవిదూరుఁడ నౌట కారణం
బైన యతాత్ముఁ డొక్కఘనుఁ ♦ డల్గి శపింప నిరస్తభాగ్యతన్. ౨౮

తే॥ రక్కసుఁడ నైతిఁ దపము కఠరం బొనర్చి, యజు వరంబున నఖిలశస్త్రాస్త్రవధ్య
తం గడసి చేయరాని కృత్యములు సేసి, నేఁటి కిటు కడ తేఱితి నీ సనరున. ౭౯

తే॥ నీవుగాఁ గొండు గెడపంగ నేర్చునయ్య!
నన్ను వైష్ణవధామమ్ము నను బొసంగి
యన్నియు నెఱింగి యిమ్మెయి నసదు గాని
బలముఁ జలమును నెఱపి తీ ప్రథనమునను. ౮౦

క॥ మును మోహము పైకొన మే, నని యే నని తెలియ నిప్పు డఘహార! నీత
త్త్వనిరూఢిం గనఁగంటిని, దనుధారులఁ బ్రోచుదొరవు తథ్యమటంచున్.

ఆ॥ కాంచెఁ గడుపు చల్ల గాఁ దల్లి కౌలస్య
ని న్నటంచు జనకు నిష్ఠగన్న
కలిమి యీమె యంచుఁ గలికి సుమిత్రి యీ
యన్నఁ గనియె ననియుఁ నెన్నఁ గంటి. ౮౨

ఉ॥ ఇంక భవత్పదాబ్జయుగ మే భవబంధముఁ బాప నామదిం
బొంకముగా నిలం గలుగు పోఁడిమి చొప్పడుఁగాత వాణి యే
వంకకుఁ బోక త్వన్మనుజ పంబున నెక్కునుఁగాత కర్ణముల్
శంకరకీర్తితాత్మకృతి సారరసాయన మందుఁగావుతన్. ౮౩

ఆ॥ కరుణ కలద కాదె కల్యాణగుణధామ!, నిన్నుఁ బొగడు నేర్పు నీపదార్చ
నమునఁ దవులు వంద నకృతిపాటవమును. గూర్చు మయ్య! నాదు కోర్కె నెగడ.

క॥ రామ! రఘురామ! సీతా, రామా! యభిరామ! యాత్మ రామా రచితో
ద్దామ సపత్నవిరామా!, నామనవిని విని మనుపుము నతసుత్రామా! ౮౫

ఆ॥ నీకు వందనములు నిర్మలజ్ఞానమూ, ర్తీ! ప్రసన్నహృదయ! తేర్చుమయ్య!
ననుఁ బ్రపన్ను నింక నాకలోకము సేర, నాన సేసి యఘము లదరి చెదర.

—రాముఁడు వాని నుడులం మెచ్చి వరము లిచ్చుట—

క॥ మాయ ననుఁ జుట్ట కెడలఁగఁ, జేయుము తండ్రీ! యనంగ సీతావిభుఁ డిం
కేయఘములుఁ బొరయవు లె, మ్మోయీ! యజితుఁడవ యెందు నుజ్జ్వలకీర్తిన్.

క॥ భాసిల్లెదు మద్భక్తి ప్రి, యాసపడినఁ గాని దొరక దది కదిసిన మా
యాసంస్మృతి సంభవములు, దోసము లవ్వారిఁ బెరయ దొరఁకొన వనఘా! ౮౮

ఆ॥ నాదు దర్శనమున నలి వాసె ముక్తుండ, వైతి పొమ్మనంగ నాతఁ డంత
రంగ మలరఁ బొంగి యఖిలార్థసంసిద్ధి, కైన తీర్థ మనుచు నంఘ్రియుగము.

ఆ॥ మొనసి మ్రొక్కి రామ! ♦ మునిసంధ్యనామ! యీ
త్రోవ యోజనార్ధ ♦ దూర మెనసి
నీదురాకఁ గోరు ♦ నియతాత్మ శరభంగు
నరయఁ గాంచి పూజ ♦ లందుమయ్య! ౯౦

—♦ రాముఁడు శరభంగమహాముని యాశ్రమమున కరుగుట ♦—

క॥ అని తెలిపి వాఁ డరిగె న, య్యనఘులు ముఫ్వురుఁ దదాశ్ర ♦ మాంతము సేరం
జని రవ్వల నవ్వలనునఁ, గనరాని వికాస మొకఁడు ♦ గనుపట్టె సఖీ! ౯౧

సీ॥ కడలెల్లఁ గడకొత్తి♦గడవ మేకొనువృత్తిఁ, దొలుదొల్త నొకతేజ♦దోఁచి నెఱసు
వెలుఁగులో వెలుఁగన్న♦వెరవొప్పఁ దన్మధ్య, మండలంబగుచు వే♦త్రొండు వెలయఁ
బుష్పకంబని యెన్నఁ♦బోవంగ నంతలో, బూరుషాకృతి యందుఁ♦బొడమి మెఱయ
దివ్యుఁడంచు నొకింత ♦ తేటిచూచెడునంత, ఛత్రచామరశశి ♦ చ్ఛాయ లొలయ
ఘనుఁడె యానాఁగ సురసిద్ధ ♦ మునులు బలసి
కొలుచు నమ్మేటి విభవమ్ము ♦ క్రొత్తసేయ
నింద్రుఁడే యనస్నై త్రిద ♦ శేంద్రుఁ డమ్మ
హామునీంద్రునిఁ జేరంగ ♦ నరుగుటయును. ౯౨

క॥ వింత యనుచుఁ దమ్ముఁడుఁ దన, కాంతయుఁ గన రామవిభుఁడు ♦ కల్యాణగుణా
భ్యంతరుఁడు వారి కిట్లనె, మంతనమున సంతసమున ♦ మలయజగంధీ! ౯౩

చ॥ వయసునఁ దెల్వితేటల న ♦ వారితవైభవయుక్తిఁ దేజున
న్నెయికొను లక్షణంబుల న ♦ మేయగుణాకరుఁ డింద్రుఁ డంచు ని
శ్చయ మొదవె న్మహామహుని ♦ సంయమిఁ గన్గొనవచ్చినాఁడు నేఁ
డయము ఫలించె నిందఱకు ♦ హాయిగ నిమ్మహితాత్ముఁ గాంచుటన్. ౯౪

క॥ ఒక్కింతసేపు నిలిచినఁ, జక్కఁగ నం గనియు నచటి ♦ జాడ లరసియున్
దక్కిన మిముఁగాని చనియెద, నిక్కరణిన పొసఁగు మునుల♦యిక్క లెనయఁగన్.

చ॥ అనుచుఁ బరిక్రమించు తఱి ♦ నాసురమండలభర్త మానితో
ననె మునివర్య! రాముఁ డదె ♦ యాశ్రమముం బెరయంగ వచ్చువాఁ
డనుపహితాఖిలార్థు నిపు ♦ డాతనిఁ గన్గొన సిగ్గు దోఁచెడిన్
బనివినువాఁడ నామహితు ♦ పంపున నాదట రమ్ము సమ్మతిన్. ౯౬

—♦ శరభంగమహాముని యింద్రునిఁ బనిచి రాము నెదుర్కొనుట ♦—

ఆ॥ అనిన వల్లె యనుచు♦నమరేంద్రుఁ బనిచి శ్రీ, రాము ధృతజటాభి♦రాముఁ గాంచి
యువనిజాతతోడ♦ననుజునితోడ న, మ్మానసీయు వేఁడి♦మమత నెఱయ. ౯౭

వ॥ అమ్మునివ్వరం దోడితెచ్చి యాశ్రమమధ్యప్రదేశంబునం బ్రవేశోత్సవంబు సంధానించి పూజించి తపోధనవరేణ్యుండు సంతుష్టాంతరంగుం డగుచుఁ బ్రణిధానప్రణిహితాంజలిబంధుండై మహితాదరంబునం గొలుచు నత్తఱి శక్రోపయానముం గూర్చి ముచ్చటించిన నమ్మాయామానుషవేషధారితో నాజటాధారి యిట్లనియె. ౯౮

క॥ నను బ్రహ్మలోకమునకుం, గొని చన నరుదెంచె నతఁడు ♦ కోవిదనుత! యే
నెనయుదునే పరమాతిథి, నినుఁ గొల్వక నీదుపనుపు ♦ నెత్తిఁ గన కొకఁటన్.

వ॥ చిరంతనతపఃప్రభావ సముపార్జితంబు లగు బ్రాహ్మ్యనాకపృష్ఠ్యాది సకల పుణ్యలోకంబులు సమర్పించువాఁడ నీయందుఁ జేర్చు నవి యెల్ల ముక్తాస్ఫోటంబునం బడు జలబిందువు లెల్ల మౌక్తికంబు లగు తెఱంగున నక్షయంబులై భాసిల్లు నని మఱియు నిట్లనియె. ౧౦౦

ఆ॥ ని న్నెదం దలంచి ♦ నీనామమంత్ర మా, వర్తనమునఁ గూర్చి ♦ వారకే ని
రీక్షణం బొనర్చి ♦ యిమ్మెయిఁ గనఁగంటి, తఱిఁ దనర్చు నీదు ♦ దర్శనంబు.

వ॥ ఇంక న న్నెకొఱంతలుం బొరయనేరవు నాపొనర్చు విధానంబున కానతి సేయవే యనిన శ్రీరాముండు స్మేరవదనుండై యిట్లనియె. ౧౦౨

ఆ॥ ఏగ్రహించువాఁడ ♦ నెల్లపుణ్యంబులఁ, దఱి నొసంగువాఁడఁ ♦ దరణి జలము
లట్లు పీల్చి యొసఁగఁ ♦ డా సమయప్రాప్తి, వాని శుద్ధములుగ ♦ వఱలఁజేసి.

వ॥ మహానుభావా! యపవర్గంబు చూఱఁగొంటి వింక నీయిచ్చవచ్చిన ట్లెల్ల మెలఁగు మనిన జీర్ణత్వక్కు నురగం బట్టు లమ్మేను విసర్జింపం దలంచి శరభంగుఁ డభంగురంబుగా జ్వలనంబుం బ్రజ్వలింపం జేసి యద్దానికి నిఖిలసంస్కారంబులుం బొనరించి సకలధర్మంబులు నప్పరమేశ్వరునందు సమర్పణంబు గావించి విరక్తుం డయ్యుం దదేకరక్తుండై సీతాలక్ష్మణసమేతుండు నప్రమేయగుణాకరుండు నగు నద్దేవుని వలగొని సభక్త్యున్మేషంబగు విశేషంబు దనుపారం గేల్మోడ్చి లక్ష్యాభిముఖ్యంబు నలువొంద నమందానందంబున నిట్లనియె. ౧౦౪

—♦ శరభంగమహాముని యగ్నిప్రవేశము సేయుచు రాముఁ బ్రార్థించుట. ♦—

ఉ॥ కన్నులు చల్లనయ్యె నినుఁ ♦ గాంచినయప్పుడె రామచంద్ర? నీ
వున్నతలంబు నిర్మలము ♦ హా సురభిత్వము సద్దయార్ద్రభా
వోన్నతియు న్నుతింపఁ ♦ దరమో ధర మోపితి పాద మింతకా
కిన్నెఱి నేఁగుదొంతె స్మరి ♦ యించిన యంతన పున్నె మంతయే. ౧౦౫

ఉ॥ అందఱచిత్తమందునిల ♦ నోదువటందురు పెద్దలంచుని
న్నిందఱవీడిపిల్వవిను ♦ చెట్టులొ రాకయు నెట్టులో మహా
సుందరమూర్తివై సుదతి ♦ సూనుఁడుఁదోడుగఁ బాఱు తెంచినా
ముందరఁగానుపించితివి ♦ మోహవిదూరతకిన్ని వావులే. ౧౦౬

ఉ॥ ముద్దులు మూఁటఁ గట్ట నగు ♦ ముల్లియ కా కిది యంతమాత్రమే
పద్దులు చూపుఁ బాపు స్ఫుట ♦ పద్మదళాక్షుము వల్కలాంబరం
బద్దిర? సజ్జటావళిక ♦ లాంచిత ముల్లసితస్మితంబు సం
పద్దయితంబు రూప ముప ♦ మాన మొకం డని దీని కుండునే ౧౦౭

తే॥ అభవ; దూర్వాదళశ్యామ ♦ లాంగ; నీవు, నిలుతుగా కెల్లవేళల♦నియతి నాదు
హృదయపీఠిఁ దటిల్లత ♦ యింతి సీత, ఘనుఁడ వగు నీదు చెంగటఁ ♦ గదలకుండ.

క॥ ఈబొంతఁ దపులఁ బెట్టెద, నేఁ బోయెద బ్రహ్మసభను ♦ నిలువఁగ నెటులో
నీబాటఁ బడితిఁ జాలు ని, రాబారులపాలిపంట! ♦ రహి నెల వీవే. ౧౦౮

— ♦ శరభంగమహాముని బ్రహ్మలోకమున కేగుచు సుతీక్ష్ణుఁ గనుమని రామునకుఁ జెప్పుట ♦ —

తే॥ అనిన రాముఁడు మేలు మే ♦ లని నుతింప
వహ్ని ముదిమేను దహియించు ♦ వరుసతోన
దివ్యరూపధరుం డయి ♦ తేజరిల్లి
బ్రహ్మపురి కేగె నతఁడు సౌ ♦ భాగ్యలలిత ! ౧౧౦

ఉ॥ అన్నెటి నేగుచోఁ దపసి ♦ యాడె సుతీక్ష్ణునిఁ గాంచు మన్న నా
కన్నఁ బ్రపన్నుఁ డాతఁ డని ♦ కానఁ దదాశ్రమముం గనంగఁ బో
నున్నతటిం దయామయు మ ♦ హోజ్జ్వలు రామునిఁ జూచు వేడ్క మే
ల్పన్నుగడల్ గడింతు ననెఁ ♦ బారులబాఱులు బాఱుదేఱఁగన్. ౧౧౧

— ♦ దండకారణ్యమున మునులు రాముని దర్శించి మాటలాడుట ♦ —

తే॥ దండకాటవి నున్న య♦త్తపసు లెల్ల, నమ్మెయిని జనుదెంచి మా♦యామనుష్య
భావలలితు లవ్వారల♦ప్రణతు లంది, దీవెన లొసంగి చిత్ప్రభా♦దీప్తి కలరి.

ఉ॥ రామునిఁ గాంచి పల్కి రభి ♦ రామగుణాకర ! భద్రమూర్తి! మా
నేమము లెల్ల నీవలని ♦ నేస్తము సూపి ఫలించె నేఁటికి
క్షేమము భారముం దలఁగ ♦ బట్టిన పట్టునఁ గాక పుట్టు వీ
వేమెయిఁ గాంతు కాఱడవి ♦ నెట్టులు మెట్టఁ దలంతు వింతలోన్. ౧౧౩

ఆ॥ నీవు హరివి లక్ష్మి యై♦నెలత జానకి లక్ష్మణుండు శేషుఁ డట్టు♦లుండి పుడమి
యందుఁ బాసి యడల ♦ నవతరించితి రిట్లు, దండిరక్కసుల వి ♦ తండ మడఁప.

ఆ॥ ఈవు దేవతలకు ♦ నింద్రుండ వోలె మా, కిలకు కర్మసాక్షి ♦ కులమునకు స
నాథుఁడవు ననాథ♦నాథుండవును నైతి, కష్టసుఖము లరసి♦కావుమయ్య! ౧౧౭

క॥ బలి షష్ఠాంశమ్ము తపసి, ఫలమునఁ జతురంశ మెనయు♦పార్థివుఁ డోమ
న్వలెఁ బ్రజలఁ బ్రజల నటుల, క్కలన న్ననఁదగు విశేష ♦ గతి మముఁబోంట్లన్.

క॥ ఆయువు శాశ్వతకీర్తియు, శ్రేయముఁ గొను రాజు జనుల ♦ చెడుగు లడంపన్
బాయుఁ దనమేలె మేలని, యేయెడ నేనియు నుపేక్ష ♦ నెనసి చరింపన్. ౧౧౮

క॥ నీయెఱుఁగని యది కలదె మ, హాయోగివరేణ్య! యింత ♦ యారసి చెట్టల్
త్రోయఁ దమకించి తోఁచితి, వాయనువున వెడలి తిప్పు ♦ డడవుల మెలఁగన్.

క॥ మాయావిదూర! తొలుతనె, మాయిరవులు ద్రొక్కి చూచి ♦ మాయంతరముల్
మాయెడఁ జాలమియును గని, మాయావి వివర్తనములు♦మాయింపఁగదే. ౧౧౯

క॥ ఏదియు విడువ కరయఁ దగు, నీదండక యను వనమ్ము ♦ నెనయు పొలములం
దోదయిత! యింతపట్టును, నీదయకై వేచియుంట ♦ నెఱి మా కొదవెన్. ౧౨౦

క॥ విన్నప మొనరింతుమ కా, కన్నెఱి వల నెఱిఁగి వచ్చు ♦ టరయక కాదో
సన్నుతగుణ! మాదెసను ప్ర, సన్నత నెఱపంగనీక ♦ చను నెవ్వేళన్. ౧౨౧

—♦ శ్రీరాముఁడు మునుల కభయ మొసంగుట. ♦—

ఆ॥ అనుచు దోసి లొగ్గి ♦ యతిదైన్యమున వేఁడు, వారిఁ గాంచి భాను♦వంశతిలకుఁ
డనియె నిట్టు లనఁగ♦నగునె యాజ్ఞప్తి వి, జ్ఞప్తిరూపసముప♦క్లృప్తి నెఱయ. ౧౨౨

తే॥ తండ్రియానతి నెమ్మదిఁ♦దవిలి త్రోవఁ, దమ్ముఁ డమ్మోయి రాజ్యభా♦రమ్ము మోవ
నరుగుదెంచితి నియ్యెడ♦నధివసించి, మానిమండలి కష్టము♦ల్మాలఁగఁ జేయ. ౧౨౩

క॥ కడుపెద్దపొలము తపసుల, కిడిన నివాసంబ దీని ♦ నేడ్తెఱఁ గొన మ్రి
క్కిడులు పొలదిండితోడుగఱి, లడరం దొరకొని రనంగ ♦ నది తెఱ వగునే.

తే॥ సంయములు నివసించు నా♦శ్రమము లెల్లఁ, జుట్టివత్తుము చెఱుపులు♦సూచి కట్టు
దిట్టములు పొనరింతుము♦ తెలివిమీఱఁ, గొంతకాలము వసిన చ♦రింతు మరయ.

క॥ అని నొడువు రాము నుడులకు, మును లెల్లగు సంతసమ్ము ♦ మునుకొన వారిం
గొని చని పూజించిరి తమ, యనువర్తితములు తపమ్ము♦లపుడె ఫలింపన్. ౧౨౬

—♦ శ్రీరాముఁడు మునుల యాశ్రమము లెల్లఁ దొ్రక్కి చూచుట. ♦—

తే॥ ఒక్క యాశ్రమమునుండ♦నొదిగియొక్క, రాశ్రయింతురుమాచోట♦నడుగిడంగఁ
బోలదే యని యుత్కంఠ♦వొసఁగ వారి, పున్నె మేమని వచియింతుఁ♦బూవుఁబోఁడి!.

చ॥ కనుఁగొనువారు పున్నెముల ♦ కాల మిదే యని యెన్నువారు ని
ర్ధనులు తపోధను ల్గాను సు ♦ తారఁపుఁ బెన్నిధి యంచు నుబ్బువా
రనయముఁ బాపనాశనస ♦ మర్ధము తీర్ధము గంటి మింక నే
మనియెదువారు నైరి మును ♦ లద్దియుపో సుఖ మన్న నద్రిజా!. ౧౨౮

మ॥ మృగబాధల్ దనుజాధమవ్యధలుఁ బో ♦ మిన్నంది కర్మందులా
ప్పఁగ నానందమయుండు రాముఁ డ డవిం ♦ బాలించె నీకైదు నా
నగు నేం డ్లమ్మెయిఁ ద్రొక్కి చూడని పొల ♦ మ్మా లేదు నైరస్యమా
మొగియంబో దను వాదము ల్సెలఁగ న ♦ మ్మోదప్రభావోదయా! ౧౨౯

తే॥ వనవిహారంబు సలుపుచు ♦ వచ్చివచ్చి, తపసు లొనరించు పూజలఁ ♦ దనిసితనిసి
యమ్మహాత్ముల సూక్తుల♦కలరియలరి, రామవిభుఁ డొప్పె నచట మ♦రాళగమన!

మ॥ తల లెమ్ము ల్పరిశుష్కగాత్రితతులుం ♦ దార్కాణగాఁ గానన
మ్ములఁ గాన్పింప దయామయుం డడుగఁగా ♦ మోమోట యింకేల యం
చలఘు ల్మౌనులు విన్నవించి రివె మా ♦ యయ్యా జనస్థానగు
ల్మోలదిండు ల్పొనరించు దుండగము లా ♦ ప్రొద్దుర్ సముద్దండత౯. ౧౩౧

క॥ దక్కిన తపసులఁ బోనీ, రెక్కరణిన యేని మెలఁగ ♦ నెంచరు వా రీ
ది క్కనయు మానిమండలిఁ, జిక్కిన దీజనమె యిపుడు ♦ సీతారామా!

ఆ॥ నిష్ఠఁ బాయలేమి నెఱిదక్కి యిక్కొన, నిలిచినార మెదిరి ♦ నేర మెంచి
కొంత వారణమ్ము♦గొనకొను బ్రాహ్మ్యతే, జమ్ము వమ్ముగాఁగ♦జరుపుకొనుచు.

క॥ నేఁటికిఁ గంటిమి నీకృప, మాటికిఁ బొగడితిమి నీదు ♦ మహిమ వితర్కం
బేటి కిహము పరమును నా, చోటుల మముఁ బ్రోవ నెట్లు ♦ చూచెదొ రామా.

క॥ అని వారు మొఱ్ఱవెట్టఁగ, వినిరాముఁడు కరుణ వెల్లి ♦ విరియ నపుడె నె
ట్టనఁ బ్రతిన నెఱపె నే న, ద్దనుజుల వధియింతు ననుచు దాక్షిణ్యనిధీ! ౧౩౫

క॥ శరచాపఖడ్గతూణీ, ధరులై రాక్షసవినాశ ♦ తత్పరతం గ్రు
మ్మరుచున్నవారి నిర్మల, తరభావం బరయ నెఱయ ♦తలఁ పొలయంగ౯. ౧౩౬

—♦ సీత శ్రీరాముని యభిప్రాయం బెఱుఁగఁదలచి ప్రశ్నించుట ♦—

క॥ మంతనమున సీతాసీ, మంతిని రఘురాముఁ జేరి ♦ మది నన్నెఱి నా
నంతసము దొనుకనిట్లనె, నంతర్ముఖపూజ్యసన్మ ♦ హాసామ్రాజ్యా! ౧౩౭

సీ॥ తలఁగు ధర్మువుమాటఁ♦దవ్వులుమానిసి కొంటి, కెడయానియఘుమెప్డు♦నెడయకుంట
నసదుక్తి యన్యదా ♦ రానక్తి విధిగాని, పరహింస సేఁత నాఁ ♦ బరగు నవియు
మొదలిరెండును నిన్ను♦మొనయవు సత్యసం, ఘఁడ వేకపత్నీవ్ర♦తుఁడవు నగుట
శస్త్రపాణిత్వంబు ♦ జతనమై మేకొంటి, వది కృత్యమో కాదో ♦ యరయరాదు.

రాజ్య మన్యుని దయ్యె దు♦రంబునాక
యొద్ద నూరక వధియించు♦టొప్పు నెట్లు
తపసుల పొలమ్ముఁ గాపాడఁ ♦ దలఁప యేనిఁ
గాచికొనియుండ నగుఁ గల ♦ కాల మనఘ! ౧౩౮

క॥ మునిచరితమునను మెలఁగుట, యును బొల్పడె దానిఁ దలఁగ♦ నుభయచ్యుతి నె
ట్టనఁ గనుట యగునొ వలనో, యనవద్యగుణా! యెఱింగి ♦ యగు వర్తింపన్.

తే॥ దహను చెంగట నింధన ♦ తతులపోల్కి, క్షత్రజాతి కెదుట విండ్లు♦శరము లున్నఁ
దేజ మతిమాత్ర మగుఁ గాని♦ తెరలఁబోదు, దాన నొడ్లకుఁ గీ డొంటఁ♦దారసిల్లు.

చ॥ కలఁడు తపస్వి యొక్కరుఁడు ♦ కాననసీమను గందమూలముల్
ఫలములుఁ దించు నిష్ఠమెయిఁ ♦ బాపము వంకకుఁ బోక సత్యముం
దలఁగక పెద్దకాలమును ♦ దాఁ గడుపం గని యిందుఁ డోర్వ కొ
క్క లసదసి న్ధరించి చని ♦ కన్నన నాతనిఁ గాంచి ముచ్చటన్. ౧౪౧

క॥ నీయొద్ద నునిచికొ మ్మని, ధీయుతుఁ డాఖడ్గ మొసఁగి ♦ దేవనగిరికిం
బోయిన నాన్యాసం బెడఁ, బాయ కతఁడు తెలివిమెయిన ♦ పరఁగుచు నుండన్.

ఆ॥ కొంతకాలమునకుఁ ♦ గ్రూరత వాటిల్ల, నెదుసుపడినవాని ♦ నెల్లఁ దునిమి
యోగనిష్ఠకలిమి ♦ నొదవంగ నగు గతి, సెడఁగ నిరయవసతి ♦ నొడిచికొనియె.

క॥ ఎక్కడ శస్త్రము క్షాత్రము, నెక్కడ వనమును దపంబు ♦ నెల్ల యొకఁడుగా
దక్క నన వలనుపడునే. తక్కొరులకు వ్యసని యేనిఁ ♦ దానును జెడఁడే. ౧౪౪

తే॥ దేశధర్మ మెడయనీని ♦ తెరువువట్టి, సారిది వర్తిల్లు నతఁడు సు ♦ శ్లోకుఁ డగును
పునుపయోధ్యాగమం బెప్డు♦పొనరుపడునొ. నాఁటి కీనాఁటివృత్తియు♦ననుచు నధిప!

ఉ॥ అన్నెఱి నత్తమామలకు ♦ నక్షయమౌ ధృతిఁ గూర్చుదాననై
తిన్ననిసేవ లే నెఱప ♦ దేవవిభుత్వము తోడిపాటి య
భ్యున్నతిఁ గంటి వీడితి మ ♦ హొజ్జ్వల సన్నియ ప్రసక్తి సం
పన్నతఁ గోరఁగావలదె ♦ పావన మాత్మసుఖంబు పొల్పడన్. ౧౪౬

తే॥ ధర్మసారమ్ము జగమర్థ♦తతియుసుఖము, ధర్మమునగాంచునరుఁడుత♦త్పరుఁడయేని
గానియమమ్ము లెడపక♦కార్శ్య మొంది, యైనవనచర్య నెఱపంగ♦నగుమహాత్మ!

క॥ కాన నకారణకృత్యం, బూని పరుల హింస సేయు ♦ టొప్పదొకో యం
చేను మదిఁ దలఁతు నిట్లను, నానేరమి సైపవలయు ♦ నాథ! నెనరునన్. ౧౪౮

క॥ గురుభక్తివశతఁ గరుణా, పరత విధిజ్ఞత నుదార ♦ భావంబున స
ద్వరణీయగుణత సీతో, సరిరాఁగలవార లెవరు ♦ జగతి నధీశా! ౧౪౯

ఆ॥ ఏను విన్నవింతు ♦ నిట్లని శాసించు, దానఁగాను తలఁపుఁ ♦ దఱిఁ దలంచి
యైన దారితల స ♦ మాశ్రయింపంబోలుఁ బ్రాణనాథ! లోక ♦ పావనముగ.

ఆ॥ అనుచు భర్తృభక్తి ♦ యనురూపముగఁ బల్కు
పలుకు లెడఁద మెచ్చి ♦ భరతుభ్రాత
యన్నియును నెఱింగి ♦ యద్దేవితో నవె
వింత నేర్మి నెఱయ ♦ విశ్వవంద్య! ౧౫౧

—♦ శ్రీరాముఁడు సీతపలుకులకుఁ బ్రత్యుత్తరం బిచ్చుట ♦—

సీ॥ హితము తథ్యముఁ గాఁగ♦నెలమి భాషించితి,వదె కాదె యాచితి♦యంగనలకు
ధర్మనిర్ణయమునఁ ♦ దవులు వికల్పంబు, లతిసూక్ష్మములు వాని ♦ నరయు టగిది
క్షత్రియుండై పుట్టి♦శరచాపములఁ బట్టి, యార్తనాదము విని ♦ యగునె తలఁగ
శరణాగతత్రాణ ♦ సమధికం బగు పుణ్య, మొందు ముజ్జగముల ♦ నుండు నెద్ది

పొలఁతి! పొలదిండిపోఁతులు ♦ పొదివి నిచ్చ
లుఱక దపసులఁ బొలియించు ♦ చున్నవార
లనిన ననుఁబోఁటికి సహించి ♦ యలఁతిఁ బోవ
వచ్చునే జీవితం బైన ♦ వదలవలదె ౧౫౨

చ॥ తపములు జన్మము ల్సెఱుపఁ ♦ దాపసుల న్వధియింప నింక నే
యపకృతులం బొనర్ప రెను ♦ కంజ యొకింతయు లేని చెట్టల
న్నృపవరపుత్రి! గెంటుపని ♦ నీదె కదయ్య! యనాథు లట్లు మే
మపగతరక్షణత్వగతి ♦ కాదుమటయ్య! యటంచు వేఁడఁగన్. ౧౫౩

క॥ విని యయ్యలార! యిట్లనఁ జనునే సిగ్గొదవె యేన ♦ చనుదెంచి పను
ల్గని పొనరింపకునికి కిం, క నుపేక్షకుఁ జొత్తునే సు ♦ ఖం బరయుదునే. ౧౫౪

వ॥ అని యవ్వారి నెల్ల నల్లన నూరడించి. ౧౫౫

క॥ ఏను బ్రతిజ్ఞ నొనర్చితిఁ, బూనిక రక్కసుల నెల్లఁ ♦ బొరిగొందు నటం
చానియతి మాన నీక మి, న్నేనియుఁ బై నొఱగిన న్మ ♦ హీతనుజాతా! ౧౫౬

తే॥ మాటకై వనవాసమ్ము ♦ మలయు టొంటి, యడ్డుసేసి యిందఱు పీడ ♦ నగుదు నన్నఁ
బున్నె మని యున్నె యింకఁ బూ ♦ బోఁడి తనకు, నింతమాత్రన తీఱెనే ♦ యెల్లబరువు.

తే॥ ఇద్దెసం గలతత్త్వ మెం ♦ డెఱిఁగి కాక, యాశ్రయింతురె యవ్వార ♦ లలఁతివారె
తపముపోక సహింపక ♦ తారసిల్లు, నాపదల నెల్ల నోర్చెద ♦ రవనితనయ. ౧౫౮

తే॥ ధర్మసంస్థాపనమున కీ ♦ తరమువారు. జనన మందుట యిదియె ని ♦ శ్చయము సుమ్ము
బ్రహ్మసత్త్వంబుపైఁ గాఁపు ♦ పనికిఁ గాక, కాల్పనే క్షత్రజాతి యే ♦ కాలమునను.

క॥ అలినీలాలక! యిప్పని, పిలువక మును దీర్చుమేలి ♦ బియ్యె దెనసి పద
మ్ములఁ బడి వేఁడినఁ గాదనఁ, గలనే కలనేనియు న్వి ♦ కారము గలదే. ౧౬౦

తే॥ చిచ్చిడెడువాఁడు విషదాయి ♦ క్షేత్రదార
హారులు ఘాతుకుఁ డఖిలస్వ ♦ హర్త వీర
లెదురుపడఁ జాలి వధియింపఁ ♦ డేని వారి
పాపమునఁ దానుఁ జెడు భవ్య ♦ భావసహిత. ౧౬౧

క॥ ఏ నిందులకై పోడమితిఁ, గానఁ దలంకంగఁ జనదు ♦ కాననసీమ
న్నానాసత్త్వవినాశము, మానుగ నాపాలఁబడె ని ♦ మంత్రిత మగుచున్. ౧౬౨

ఆ॥ పెరిమగలవుచాల ♦ శ్రేయసీరత్నంబ, వగుదువిట్టులాడి ♦ తనుచు మెచ్చి
నాఁడ స్వాభిజాత్య ♦ నందితగుణయోగ, మరసి స్వరసభావ ♦ మచ్చుపడఁగ. ౧౬౩

క॥ అని తెలిపిన నాయమ ముద. మునఁ బొదలఁగ దోడికొనుచు ♦ మున్నాడి సుతీ
క్ష్ణునిఁ గాంచఁగఁ గుతుకము మది, నినుబడిగాఁ జనిరి వార ♦ లేణాంకముఖీ!

ఆ॥ ధర్మభృత్ప్రదుండు ♦ తపసి యొండొక్కరుం, డనుపహాఁగ రాగ ♦ మతిశయిల్ల
ననుచు నతనితోడ ♦ నానాలతాద్రుమ, కామనీయకము ర ♦ కముల గనుచు.

ఉ॥ దూరము మార్గము న్నడచి ♦ తోరముగా నడిమిన్నునం దమో
దారి వెలుంగుచున్నతఱి ♦ దారితల న్గని రున్మనస్కులై
సారసకైరవోల్లసిత ♦ సౌరభసంపదుదార మొక్క కా
సారము నీరపూరరస ♦ సారవిశిష్టగుణప్రచారమున్. ౧౬౬

ఉ॥ ఆంతరతుష్టికిం దగిన ♦ యట్టులు బాహిరతృప్తిఁ గాంచ నౌ
నంతఁ దదంతరాంతరము ♦ నం దరయంబడె సౌధసార మి
ట్లింతలు సేయు నే వెలయు ♦ నేనియు రస్యమ కాక శ్రవ్యమే
వింతలు గావె యంచు రస ♦ విశ్రుతగేయనిబంధనోన్నతుల్. ౧౬౭

మ॥ పలుకు ల్దొ్రటిల నౌచితీకలనకుఁ ♦ భంగంబు కాన్పింప దు
జ్జ్వలరాగోన్నతి బీరువోదు రసభా ♦ వప్రక్రియ ల్మాఱ వ
ప్పలుకుందొయ్యలి యిన్నిసంపదలకు ♦ నైచ్యంగాపు గాకున్న ని
శ్చలయింపంగల గీత మున్నె యని వా ♦ రేకాగ్రత న్నిల్వఁగన్. ౧౧౯

క॥ ఆర్యనుతుఁడు రాఘవుఁ డా, తౌర్యత్రిక మొలయు తెఱవు ♦ దాపసవరు ని
ర్ధార్య మొనరింపు మన నా, దార్యము పెను పొంద ననె న ♦ తం డాత్తరసా.

—♦ మాండకర్ణి చరితము ♦—

తే॥ ఇదియు బంచాప్సరస్సర ♦ స్సిచట మున్ను
మాండకర్ణి యనం దగు ♦ మహితుఁడొక్క
తపసి పదివేల యేం డ్లొంటఁ ♦ దప మొనర్చె
వాయుజలభక్షుఁడై యని ♦ వార్యశౌర్య! ౧౨౦

సీ॥ అగ్ని మున్నగు వేల్పు♦లందఱు గుమిగూడి, యాలోచన మొనర్చి♦రలఘుఁడితఁడు
తఱి వేచి యిం దొక్క♦తల మాక్రమింపంగఁ, దలఁచెఁబోకాకున్నఁ♦దలఁగకున్నె
తపమున నిట్లని ♦ తద్దయు మఘువున. కెఱిఁగించి యల్లన ♦ నెఱుకఁ గాంచి
వా రచ్చరల మేలి ♦ వరవర్ణినులఁ బంప. నైదుగు రవ్వార ♦ లరుగుదెంచి

మచ్చికలు సూపి మునివృత్తి ♦ మలయఁజేసి
మెచ్చు లెనయించి యాతని ♦ మెచ్చువడసి
మ్రుచ్చు లే మిమ్ముఁ బాసి ని ♦ మునమయేని
బ్రిదుక ననిపించి రోరామ! ♦ ప్రథితనామ! ౧౨౧

క॥ వారలతో నీనాఁటికి, వారని కుతుకమున మౌని ♦ వరుఁ డీసరసిన్
నేరిమి నిర్మించిన సిం, గారఁపు గని మేడలో సు ♦ ఖస్థితి నుండున్. ౧౨౨

చ॥ మెలఁతల భూషణధ్వనులు ♦ మేలిమివాద్యరవమ్ములాటపా
టల నెఱయాఱజమ్ములును ♦ డంబగు శంబరవైరి బీర మి
వ్వలనున నెల్లవేళల న ♦ వార్యత నెక్కొనుచుంటఁ దెల్పు ని
ప్పొలమునఁ దత్ప్రభావమునఁ ♦ బూజ్యతఁ గాంచె నరేంద్రచంద్రమా! ౧౨౩

తే॥ అనుచుఁ దెలిపిన సంతస ♦ మ్మబ్బి మెదను
బెనఁగొనఁగఁ దీర్ఘ రాజమ్ముఁ ♦ బెరసి స్నాన
పానము లొనర్చి మునివరుఁ ♦ బనిచి యరిగి
రచటు నేరంగ భవ్య భా ♦ వానుషంగ! ౧౨౪

—♦ శ్రీరాముఁడు సుతీక్ష్ణాశ్రమమున కేగుట. ♦—

సీ॥ రామనామార్థమ్ము♦రహిఁ శారికలు వేఁడ, శ్రుతి గూర్చు శుకరాజి♦సూనృతములు
మనుప విష్ణుఁడె కాక♦మఱిలేఁడను పికాళి, పంచమస్థాయిప్ర♦పంచితమ్ము
లరగాదు పొండిదె♦యరుదెంచు హరి యంచు, నుబ్బి యాడెడుశేళ్ల♦యుల్లసితము
లబ్బె గేయప్రబం♦ధావళి మా కంచుఁ, బాడఁజొచ్చెడు తేంట్ల♦పన్నుగడలు
నడుగకయమున్నె వాచంయ ♦ మాశ్రిమమ్మె
యదియును సుతీక్ష్ణమునిచంద్రు ♦ నిదె యటంచుఁ
జెప్పకయ చెప్పె వా రల్లఁ ♦ జేర నరుగ
వల్కలాజినములును న ♦ వ్వలను సూపె. ౧౭౫

తే॥ ఎల్లఋతువ్రులు నద్దాన ♦ నెనసి మెలఁగ
బ్రథితఫలపుష్పసంతాన ♦ భరిత మగుచు
నొప్పు నప్పున్నెపుంబొల ♦ మోజ నెఱయఁ
దఱియఁజొచ్చిరి వారు కాం ♦ తాలలామ! ౧౭౬

క॥ మునిశిష్యులు తోడనె రా, మునిరాక యెఱుంగఁ జేయ♦మున్నె యెఱుక గాం
చినప్రోఁడ తబిసినెల తె, ప్పున నర్ఘ్యాదికముఁ గొంచుఁ♦బొడసూపె సఖీ! ౧౭౭

తే॥ ఏను రాముఁడ సోదరుండితఁడు లక్ష్మ, ణుండు ధరణిజ యీపె నీ♦యండ సేరి
నార మో బ్రహ్మనిభ! యని♦నలినగర్భ, వందితుఁడు వందన మొనర్చె♦వారిజాక్షి!

క॥ తక్కినవారును నమ్మని, కక్కరణిని మ్రొక్కి రాతఁ ♦ డాశీర్వ్యాధులం
ద్రిక్కక పొనర్చి రాముని, జిక్కని కౌఁగిటఁ గదించె ♦శ్రీరుచిరాంగీ! ౧౭౯

ఆ॥ నిన్నుఁ గొలిచి నీదు♦వేమను లీక్షింరించి, యింతవార మైతి♦మీవు మ్రొక్కఁ
గాంచు నేర మెట్లొ♦కల్యాణగుణమూర్తి, యనుచుఁ బొగడె మాని♦యలఘుకీర్తి

క॥ విధివత్పూజావిధుల, న్విధిసన్నిభుఁ డవ్విభునకు ♦ వేవే పొనరిం
చి ధృతాంజలియై వేఁడెను, విధుమండలసదృశవదన! ♦ విచికిలరదనా! ౧౮౧

తే॥ రమ్ము నాతండ్రి! యిమ్మంది ♦ రమ్ము పావ
న మ్మొనర్పు మటంచు మా ♦ నాథుఁ గొంచు
లోని కరిగెను ముని యెట్లు ♦ లోఁ దలంచి
యుంచెనో కదె రుచిరమ ♦ హోజ్జ్వలాంగి! ౧౮౨

ఆ॥ చిత్రకూట మీవు ♦ చేరిన యప్పుడె, యింద్రుఁ డరుగుదెంచి ♦ యెల్లజగము
లోడిచికొంటి వెనయు♦మోయయ్యవిధిలోక,మని యెనని మె మాని♦యఖిలవంద్య!

క॥ వెండియు నమ్మునిశశి నీ, యండఁ గనంగంటి నంటి ♦ వఖిలేశ్వర ! నీ
దండఁ బెరయఁ గాదే యిం, దుండవలసె నని సుధాస♦ముచితాలాపా ! ౧౮౪

వ॥ అని యిట్లు లొండొండ సరససల్లాపంబులం బెనుచుచు భక్తివిశేషోత్కలితలోచ
నుండై యయ్యగస్త్యశిష్యవరేణ్యుండు నిండుమనంబున రామా ! రక్షోవి
రామా ! మాయుకీనసుకృతంబు లెల్ల నీకే సమర్పించినాఁడ భవదీయాశ్రయణంబు
దక్క నొండు గతి యే నొల్ల చిరకాలమునుండియుఁ దావకీననామమంత్రమ్మె
జపించుచు భవద్దాసానుదాసుండనై నీదు సుచరిత్రమ్ములు వినుచుఁ ద్వదీయ
కల్యాణగుణంబు లెల్లప్రొద్దులం గొనియాడుచు ననితరసుఖోదయమ్మునఁ బ్రవ
ర్తిల్లుచున్నవాఁడ నవధరింపుము. ౧౮౫

—♦ సుతీక్ష్ణుఁడు రాముని స్తోత్రము సేయుట ♦—

తే॥ ఓయనంతగుణా ! యప్ర♦మేయ! ధరణి. జామనోహర ! హరవిధి♦సంస్తుతాంఘ్రి?
రామ ! నామాభిరామ ! సు♦త్రామవినుత !, పావితాఖిలలోకసం♦భావితాత్మ !

క॥ భవసింధుతరణమునకుఁ, భవదంఘ్రిసరోజ మెన్నఁబడెఁ బోతముగా
నవలంబనంబు మా కదె, నవరణ పొనరించు మోహ♦జనితాంధ్యంబుఁ. ౧౮౬

ఉ॥ నీ కయి సేవ వచ్చితివి ♦ నిర్మలభావతఁ బ్రోవ నెంచి యే
నేఁకటఁ బుత్రదారగృహ ♦ హేయభవాంధువునందుఁ గూలి యా
పోకనె పోయి పోయి మల ♦ పుద్గలపిండము డెంద మాంధ్యపుం
జోఁకున వృత్తి పాశములఁ ♦ జుట్టి తెరల్పఁ గలంగు చుండఁగఁ. ౧౮౭

సీ॥ ఎల్లభూతంబుల ♦ మొదఁదల నుండియు, నెడఁదల నుండు ని ♦ న్నెఱుఁగకున్న
నీమంత్రనిరతుల ♦ నియతిఁ బ్రోచెద వన్య, నిరతుల నల్లంత ♦ నిలిచి కాంతు
వధికారులేని నె ♦ య్యమునఁ బ్రబోధింతువే, వధికారులైనఁ జ ♦ య్యన నడంతు
వడర నీయవు స్వభ ♦ క్తాళిపై నిజమాయ, నిజమా యభక్తుల ♦ నిలువరింతు

మాయచే జుట్టి సంసార ♦ మగ్నులుగఁ బొ
నర్తు వింతలు వింతలే ♦ నర్తకుఁడవు
కపటనాటకమునను జ ♦ గమ్ము లొకట
ముంపఁ దేల్పంగ నగుచు ని ♦ ర్మోహ మొలయ. ౧౮౮

ఆ॥ ఎంత చేసికొనిన ♦ నంతియ ఫల మన్న, నెటికిఁ గూర్తుఁ వెటిఁగి ♦ నిన్ను వలచి
తలఁచి కొలుచువారి♦తాత్పర్య మీవ యై, ననిచి ప్రోతు లోక♦నాథ ! యెపుడు

చ॥ జలకలశంబులం దరణి ♦ సంగతుఁడై నటు లెన్నిరూపులన్
వెలయఁడు నీవు నట్టె పలు ♦ వేసములం గొని సృష్టిపుష్టిసం
కలనములం బొనర్చు మొన ♦ గాడవు ధాతృహరీశమూర్తివృ
త్తులు నిజమాయ నుప్పతిలఁ ♦ దొల్లిఁటి యేకత పాయ కుండఁగన్. ౧౯౧

ఆ॥ ఒకరహస్య మభవ ♦ యుద్వృత్తినేని స, ద్వృత్తినేని నెడఁదఁ ♦ దెరలనీక
నిన్నుఁ గట్టి వైచు♦నియతాత్ము ధన్యునిఁ, జేయఁ జూతువా యు♦పాయమునను.

తే॥ నీదు దివ్యపదాబ్జంబు ♦ నేఁడు గంటి
నిదె తమఃపరపారస్థ ♦ మిదె యలభ్య
మెల్లవారికిఁ జిద్వృత్తి ♦ నెనసియునుఁ బ్ర
పన్నులకు మాత్ర మెపుడుఁ బ్ర ♦ సన్నమగుట ౧౯౩

సీ॥ నాభాగధేయంబె ♦ ననిచె నివ్విధి రామ, రూపింపరాకయు ♦ రూప మెనసి
మాయావిడంబన♦చాయ నెక్కొనుఁగాక, పురుషోత్తమత దెసఁ♦బొరుపు గొనదు
కందర్పకోటిప్ర♦కామత్వమున మించి, సీతాసమేతమై ♦ చెలువు గాంచి
శరచాపములు బూని ♦ సదయార్ద్రహృదయమై, స్మితచారువదనల ♦ క్ష్మీవిశిష్ట
మప్రమేయ మనంతక ♦ ల్యాణగుణక
మంచితాజినవల్కలంబ ♦ రాఢ్య ముచిత
మైందవేందీవరద్యుతి ♦ యప్రధృష్య
మును నగుచుఁ గన్నులలరఁ ద ♦ మ్ముఁడును గొలువ. ౧౯౪

ఆ॥ కాంతు నెపుడు దేశ ♦ కాలాద్యుపాధిశూ, న్యంబు చిత్ప్రకాశ ♦ మనుచు వేద
సార మరసి దీని ♦ సరణి యెఱుంగ ని, క్కలయ నాదు మదిని ♦ నిలుచుఁగాత.

క॥ ఏ నొల్ల నింక నెవియు ర, మానాయక ! యివ్వలనున ♦ మనుపవె యన సీ
తానాథుఁ డలరి యిట్లనె, మానుగ స్మితరుచులు తమము ♦ మాయింపంగన్.

—♦ శ్రీరాముఁడు సుతీక్ష్ణమునికి వరము లొసఁగుట ♦—

తే॥ ఎవ్వి యొసఁగినఁ గొనువాఁడ ♦ నిచ్చువాఁడ, నెద్ది కోరిన సందియ♦ మేల యింక
నిర్మలము నీదు చిత్తమ్ము ♦ నియతి గెల్చి, నాడ వఖిలమ్ము నీసొమ్ము ♦ నంద్యచరిత!

క॥ మద్భక్తిపరుఁడ వీ వని, చిద్భూమానందమయునిఁ ♦ జేయఁగ వల నా
సద్భావనఁ దోఁచితి నీ, హృద్భవనమున న్వసింతు ♦ నింకఁ ద్వదిచ్ఛన్. ౧౯౮

తే॥ నాదు మంత్రము పాసించు♦నంద్యగుణులు, నన్నె శరణని నెమ్మది♦నమ్మి కొలుతు
రేనుఁదద్వృత్తి నేమఱ♦కెనసియుందు, సందియము లేక వారి హృ♦న్మందిరముల.

ఆ॥ ఇట్టి స్తోత్ర మెవ్వ ♦ రిచ్చమై నిచ్చలుఁ, జదువువార లరసి ♦ సంతసించు
వారు నఘ్టఘనులు ♦ వారక మల్లోక, సుఖముఁ గాంచి యెడఁదఁ ♦ జొక్కువారు.

క॥ నాయెడ భక్తి బెనుచు నిజ, మాయాబంధము దెరల్చు ♦ మన్మయ యోగ
శ్రీయుతుఁ బొనర్చి నరు సి, శ్రేయసపదవికి నధీశుఁ ♦ జేయు మునీంద్రా! ౨౦౧

ఆ॥ నీవు నన్నుఁ దలచుఁ ♦ నెఱి సర్వసంగవి, ముక్తిఁ గాంచితయ్య! ♦ మొనయు దింక
నంతమున మదీయ ♦ మైన సాయుజ్యంబు, సందియంబు లేదు ♦ సంయమీంద్ర!

క॥ అనఁ దద్వాగమృతఝుర, మ్మునఁ దోఁగి సుఖార్ణవమున ♦ మొనసి నియతి రా
మునిఁ దోడివారిఁ బూజిం, చెను ముని సుకృత మిదె యని వి ♦ శిష్టచరిత్రా!

ఆ॥ కడపె నచటఁ గొంత ♦ కాలమ్ము రఘువంశ, భూషణమ్ము మునులు ♦ పుణ్యఘనులు
చేరి కొలుచుచుండ ♦ సీతతో ననుజుని, తోఁ బ్రశస్తితోడఁ ♦ దోయజాక్షి! ౨౦౪

క॥ అదట నొకనాఁ డాఘనుఁ, డాదయితుఁడు తపసిఁ గాంచి ♦ యాదరమును స
మ్మోదముఁ బెనఁగొన నిట్లనె, వేదప్రసాదనిత్య ♦ విహారణశీలా! ౨౦౫

—♦ శ్రీరాముఁ డగస్త్యదర్శనార్థ మరుగుచుఁ దొ్రవలోఁ దద్భ్రాతను దర్శించుట. ♦—

చ॥ అనఘ! భవద్గురు న్స్మరవ ♦ రాఖ్య్య మహాత్ము నగస్త్యమానిచం
ద్రునిఁ గనఁగోరుచు న్మదిని ♦ రూఢతఁ దన్మయమై చెలంగెదుఁ
జనియెద మయ్యెడ న్నిలిచి ♦ సారతరోక్తులు వించు మేను గూ
ర్చిన విధికి న్ఫలంబు గన ♦ శ్రీకర మన్వయముం బొనర్పఁగన్. ౨౦౬

మ॥ అనిన న్మౌనివరేణ్యుఁ డిట్టు లనె మే ♦ లయ్యా మదీయాశయం
బును నమ్మైఁ దులకించుచున్నయది యి ♦ మ్మొం జూపి తీ వంతలోఁ
జనకా నేనును వత్తు నెల్లి సుజన ♦ శ్లాఘ్యుం దయామూర్తి నా
ఘను దర్శింప భజింప నెమ్మనములోఁ ♦ గౌతూహలం బయ్యెడిన్. ౨౦౭

క॥ తడ వయ్యె నామహాత్ముఁ గని, పొడ వయ్యె న్గోర్కి గుమియుఁ ♦ బోవుద మని యా
జడదారి స్వస్త్యయన మట్టు, నడిపెను మఱునాఁటి యుదయ ♦ నంబునఁ దరుణీ!

ఉ॥ ఆమెయి నందఱుం గదలి ♦ యాశ్రమము న్విడనాడి ప్రాంగణా
రామవిహారము న్నెఱపు ♦ రాణ మహచ్చరితప్రశంసలన్
నేమము యోగముం బడయఁ ♦ జేయఁగఁ జాలు ప్రసిద్ధసిద్ధభూ
భూమహితప్రసంగములఁ ♦ బొం పెద నింపఁ దొడంగి రంగనా! ౨౦౯

తే॥ అట్టు లన్యోన్యసంభాష ♦ ణానుమోద, సంగతి చెలంగఁ దొడరి యో ♦ జనచతుష్ట
యంబుఁ గడచిరి కడచిక్కి ♦ ప్రాంచితప్ర, పంచితవనస్థలి యొకంతు ♦ వడయఁ గనిరి

క॥ మునికులతిలకుఁడు రఘురా, ముని నుడిఁ గొని మహిమ నన్నుఁ ♦ బోలిన యనుజ
న్ముని యావాసం బిది యని, మునుకొనె నద్దాని విభవ ♦ మునువివరింపన్. ౨౧౧

సీ॥ మును గాంచినవియును ♦ మొనయ నౌ నవియును, ఫలభారనమ్రము ♦ ల్పాదపములు
పరిపక్వపిప్పలీ ♦ పరిమళ మ్మొడఁగొని, యందిచ్చుచున్నవాఁ ♦ డనిలుఁ డెజ్జేఁగి
వైదూర్యమణిదళ ♦ వర్చస్కములు దర్భ, లవె లూన శేషమ్ము ♦ లనువుపడెడు
ధూమమండలి దివిఁ ♦ దొలఁకెడు వేదిస్థ, మగ్నిఁ బేర్కొనుచు నీ ♦ లాభ్ర మట్టు
లెందు నిర్మలతీర్థమ్ము ♦ లెనసి స్నాతులై ద్విజాతికుమారు లి ♦ య్యదనునందుఁ
దారు వెంచిన తీవెల ♦ తరుల పూవు, లల్లన గ్రహించుచున్న వా ♦ రనఘ! కంటె.

క॥ పోసిన ధనరాసులె యవి, వీసరవోవని తపమ్ము ♦ విధ మెఱిఁగింపన్
భాసిల్లెడుఁ బెనుగొండల, తో సరిగా నింధనములు ♦ ధుతశత్రుచయా! ౨౧౩

తే॥ పుణ్యకర్ముండు పూజ్యుండు ♦ భూరిమహిముఁ,
డన్నయంతలు గలఁడీతఁ ♦ డలఘుచరితుఁ
డవ్వలను గాంచికాక యీ ♦ యన నగస్త్యు
భ్రాత యని పిల్వ నేమి ని ♦ పంబు రామ! ౨౧౪

ఉ॥ రమ్యతటాకము ల్వనులు ♦ రాణ దలిర్పఁ దపస్థలమ్ము ప్రా
థమ్యము నూప నేవి యవుఁ ♦ దార్కొని యయ్యవి యెల్ల నెల్లెడన్
స్వామ్యపరాజితత్వ మను ♦ సంగతిమై దనరంగ నొప్ప నో
సౌమ్య! మహాత్ముఁ డీతఁ డని ♦ సాటె సుర ల్మునులు న్నుతింపఁగన్. ౨౧౫

ఆ॥ ఇంతవట్టు వీర ♦ లంతకు నేనియు, లెక్క సేయ రెంత ♦ రక్కసులనఁ
గాని తపమువంకఁ ♦ గలిగెడు దార్ఢ్యమ్ము, కలిమిఁ బరిగణింపఁ ♦ గడఁగుచుంద్రు

క॥ ఎంతకు నేనియుఁ జాలియు, శాంతిమెయి స్నిదు రాకఁ ♦ జర్చింపుచు ని
ట్లెంతకు నిలిచెద రీదెస, సంతసమే చాలు జన్మ ♦ సాఫల్య మిడన్. ౨౧౭

ఆ॥ అనుచు నొడువు తఱిన ♦ యాశ్రమగర్భంబు, సొచ్చి మునివరేణ్యుఁ ♦ జూచి మ్రొక్కి
రమ్మహాత్ముఁ డలరి ♦ యందఱఁ బూజించె, రవియు నస్తగిరి శి ♦ రమున మెఱసె.

క॥ అంబరమణి యన్నగశీ, ర్షంబున నలువొందు నపుడె ♦ సాంధ్యకృతుల వం
కం బరఁగె వ్యగ్రభావము, శంబరరిపుజేతృవిహిత ♦ సక్తుల కొకటన్. ౨౧౯

క॥ ఎడఁ జని యావాసమ్ములఁ, బడయఁ దొడరు నీడజములు ♦ ప్రాజదువుల ప్రా
వడులఁ దగు పలుకుఁబడులం, గడకొలుపుచుఁ జాలు దెంచెఁ ♦ గంజదళాక్షీ! ౨౨౦

క॥ సమయము దోసం బిచ్చుటఁ, దమ మడరం జేయఁ జూడఁ ♦ దద్వేదిత చం
ద్రముఁ డరుదెంచెఁ బ్రబుద్ధత, కమర్త్యు లుప్పొంగఁ బ్రాంచి ♦ తాకారగుణా!

తే॥ తొవలు దమ్ములతోడఁ దో ♦ డ్తోడఁ బెంపు
గనుట నచ్చోట సరసులఁ ♦ గలసి మెలసి
యుంట నెవ్వేళ వెలయుచు ♦ నుండుఁగాని
పవలు రే లని భేదమ్ము ♦ పట్టువడదు. ౨౨౨

ఆ॥ సామిధేని శక్తి ♦ సంపదనో కాల, మహిమనో ప్రసక్తి ♦ నహిమకిరణు
కిరణసంక్రమణము ♦ పరఁగుటనో హుత, వహుఁడు ప్రజ్వలించి ♦ వఱలె నపుడు.

క॥ స్వాహాకారము లొప్పఁగ, నీహావిరహితులు తపసు ♦ లిడి రనలునియం
దాహుతులు పరోపకృతుల్, స్వాహంకారసువిదూరు ♦ లై నెగడొందన్.

క॥ పౌలఁతియు ననుజుఁడు రా రఘు, కులప్రదీపకుఁడు సమను ♦ కూలతఁ గృత్య
మ్ములు దీర్చి కులపతిం గని, యల రెఁ దదీయార్చనముల ♦ నగవంశమణీ !

సీ॥ మాపాలిభాగ్య మా♦ మరభూజమున పంట, కామధేనువు పాడి♦కలిమి యనుచు
నీనాఁట మముఁ గాంచ ♦ నేతెంచితే భక్త, వాత్సల్య మింత లే ♦ వరద! యనుచు
కఱకుఱాలును ముండ్లు♦ గాసిసేయవె మేలి, చరణాబ్జముల స్మర♦జనక! యనుచు
వత్స జానకి కూడి ♦ వచ్చెనే మృదులాంగి, కలితప్రజానురా ♦ గమున ననుచుఁ
దమ్ముడును రావలెనె యిట్టి ♦ దశ నటంచు
నెంచి ఫలమూలముల నేర్చ ♦ రించి యప్ప
నంబు పౌనరించి యమ్మౌని ♦ ననుచు వేడ్క
జరిపె వరివస్య హారికి స్త్రీ ♦ జనలలామ ! ౨౨౬

తే॥ నాఁటిరే యట్లు చన మఱు ♦ నాఁటి యుదయ
మునఁ బ్రభాతవిధులఁ దీర్చి ♦ ముద మెలర్ప
మౌనివరుఁ గాంచి సెల వీవె ♦ మహితచరిత !
యన్న సేవింప నన్న నం ♦ యమివిభుండు. ౨౨౭

క॥ నాతండ్రి! పోయిరమ్మా !, నాతరమా కా దనంగ ♦ నాయొక్కని సా
మ్మా తనపది వేనా ళ్లిటు, లీతలఁపున మమ్ముఁ బ్రోచు ♦ టెడపక మనుమా !

తే॥ నీతరమువారిలోఁ గీర్తి♦నెగడు మన్న, యనుచు దీవించి యనుపంగ♦నంత నంత
రంగ ముప్పొంగ వింజ మో♦క్కడచు చుట్టు, మల్ల తపసిని గనఁబోయి♦రవల నవల.

—♦ శ్రీరాముఁ డగస్త్యభ్రాతృ యనుజ్ఞ గొనిపోవుచుండ సుతీక్ష్ణుఁ డగస్త్యచరితంబు సెప్పుట. ♦—

క॥ దారితలనె వినిచెఁ దమో, దారి తలఁ పెఱింగి మౌని ♦ తచ్ఛిష్యుఁడు త
ద్దారితవారితవార్తలఁ, దా రితరులు మే లనంగఁ ♦ దరుణీమణిరో! ౨౩౦

తే॥ కడలి నీ రెల్లఁ జుళికించి ♦ విడిచినాడు, నడఁకు లే కడరెడు కొండ ♦ నడచినాడు
మిడియు పొలదిండిపోఁతుల♦మెక్కినాడు, తపసి తపసియె రఘుకులో♦త్తంసితాత్మ!

శా॥ మున్నీటం గల నీరు గ్రోలిన తఱి ♦ న్మోత్తమ్ములై వేల్పు లె
ల్ల న్నేమమ్మున వేఁడి వేడబమపో ♦ లావంచుఁ గీర్తింప నీ
పన్నాగంబు లి కేల యుంచు విడిచె ♦ న్బశ్చాద్గతిం దజ్జలం
బన్నన్నా! వినుతింప శక్య మగునే ♦ యాయయ్య దాక్ష్యం బిలన్. ౨౩౨

—♦ వింధ్యవారణము ♦—

తే॥ అవనిధరముల మేటి నే ♦ ననుచు వింధ్య
మొక్కతఱిఁ బాగ రెక్కి తా ♦ నిక్కి చూచె
సారగిరి మద మడఁగి పోఁ ♦ జఱతు ననుచుఁ
దపనశశిమండలమ్ముల ♦ దారి తలఁగ ౨౩౩

ఆ॥ కాలగతులు హవ్య ♦ కవ్యము ల్నెడఁగ ది, క్పాలకులును దోడి ♦ వేలుపులును
శిక్ష సేసి నీదు శిష్యుని వారించి, జగము మనుప నిదియె ♦ సమయ మనుచు.

క॥ కాశీనివాసు నాజిత, కాశి న్బ్రార్థించి తరలి ♦ కావు మని రవా
గాశఁ గలకాలమును నిలఁ, గా శమనాఁపురి వీడఁ♦గా నగు నియతిన్. ౨౩౪

క॥ దానికిఁ జెరలియు జగదవ, నానూనగుణాస్థ వఱలి ♦ యంగీకార
శ్రీ నలువారఁ దరలె గిరి, పోనీ నని మేను వెంచు ♦ పొలమున గుఱితోన్.

ఆ॥ పరమసాధ్వి ధర్మ ♦ పత్ని లోపాముద్ర, భద్రమూర్తి తన్నుఁ ♦ బాయరాని
కూర్మి నిన్ను సీత♦కొమరున మొనసి కా, ల్నడకఁ దొడరె నడవి♦నడుమ రామ!

ఆ॥ కఱకు ఱాలు ముండ్లు♦గడకొని పొక్కింపఁ, గోమలాంగి యడుగు♦కోటి లెక్క
కైనఁ దనుకఁ బోవఁ♦డమ్మహాత్ముఁడు లోక, రక్షకులకు నొంట♦రహియె మహిత!

సీ॥ ముత్తియమ్ములు పుట్టు♦మొనయుబో సంకుతోఁ, దామరపూవు నే♦స్తమునననుచు
నిందీవరప్రాంత♦మెనయుఁబో నీలిమ, యేల కాటుకపిట్ట ♦ జోలి యనుచు
విరిదీవె పొద మీఁద♦వెలయుఁబోయొండొక్క, పాడియే భ్రమరక♦పఙ్క్తికనుచు
మంచునఁ బై వెల్ల ♦ మలయుఁబో మొలకల, చాలు కొండలనేల♦చాయ ననుచు
పలుకఁ దొడరును గాని య ♦ క్కలికిమిన్న
యలఁత విడఁ జేత నైనంత♦లైనఁ జేయఁ
డడిచిపడు శిష్యు తీ రింత ♦ యరసికాని
యెం డొకఁడొనర్ప నని కల ♦ శోద్భవుండు. ౨౩౫

ఆ॥ డాసినంతలో వి ♦ డంబించు పొగరుతో, వాసి గాంచు శిరము♦వాంచి మ్రొక్కెఁ
దపసిఁ గంటఁ గన్న♦తపులున మైమఱి, పొదవఁ జెరలి యాశి ♦ లోచ్చయంబు.
తే॥ అతని దీవించి తలపైని♦హస్త ముంచి, పొదలనీయని తలఁపునఁ ♦ బూన్కి నించి
కట్టుపోఁగునఁ బెనుగొండ♦కట్టుపడఁగ, ననియె విడరాని చుట్ట మ♦య్యాదనునందు.
క॥ నవలామానిక మియ్యది. భవదాచార్యాని తోడఁ ♦ బరఁగుచు రా ని
య్యవసరమున నరుదెంచితి, నవాగ్దిశాయాత్ర సేయ ♦ నందిన మదితోన్. ౨౮౧
ఆ॥ నేల మిన్న గ్రమ్మ ♦ నేర్చు నీ విమ్మెయి. నడఁగి యుండఁ బొసఁగు♦నన్న! యింక
నేను వచ్చి పొదలు♦మీ యను నానాఁటి, కెగయవచ్చుఁ జెడునె♦యింతలోన.
శా॥ రాగద్వేషము లొందఁ గాక యొకటన్ ♦ రారాపు వాటిల్లునే
యాగంబే సురభర్త కద్రితతిపై ♦ హా వజ్ర మెత్తంగ నా
వేగం బేమిటఁ గల్గె శాంతికలిమి ♦ న్విశ్వాత్ముఁడా హీనుడున్
దా గర్వోద్ధతిఁ బెద్దవాఁడును జెడున్ ♦ దత్త్వంబు భావింపుమా! ౨౮౮
క॥ నాయాన మీఱఁ జన దని, యా యగము న్నిలిపి తత్స♦మర్చ లెనయ నై
జాయామణితోఁ దా నిటు, లీయెడ నివసించె నిమ్ము♦నీశ్వరుఁ డధిపా! ౨౮౪

—♦ వాతాపీల్వలుల నగస్త్యుఁడు పొడవడఁగించుట. ♦—

క॥ ఒక్కెడ దనుజు లిరువు రీ, దిక్కెనసిన పొలమునం దు ♦ దీర్ణు లగుచుఁ బెం
పెక్కిన మదమునఁ జొక్కఁపు, టిక్కన్నెలకొలిపి యన్య ♦ హింసాపరులై.
సీ॥ అతిథి రా రమ్మని ♦ యజపూపు ననుజన్ము, వాతాపిసంజ్ఞుని ♦ వండిపెట్టి
యగ్రజుం డిల్వలుం ♦ డనువాఁడు పిలువంగ, వరశక్తి నుదరమ్ము♦వ్రచ్చి యసుర
వచ్చిన నభయులు ♦ వాని భక్షించి త, దర్థము ల్గ్రహియింతు ♦ రందినంత
వట్టు ద్విజన్ముల ♦ వార కమ్మెయి నధి, యింప వేల్పులు ముని ♦ లెనసి తన్న
వేఁడికొన మోడి కొని వారిఁ ♦ గూడముట్టి
యర్థి ననఁ జెట్ట లెప్పటి ♦ యట్టు లెల్లఁ
జేయ భుజియించి పొట్టపైఁ ♦ జేయి వైచి
నిమురుకొనుచుండెఁ దపసి య ♦ న్నెఱి నధీశ! ౨౮౭
క॥ తనుకక ప్రథముఁడు కనుకని, జనుదెంచి యమీంద్రుఁ డున్న♦చంద మరసియున్
మనుపొరి ద్దారయనీయని, తనయెప్పటి యాగడంబె ♦ తఱుముచునుండన్. ౨౮౫
క॥ వాతాపి! రమ్మనుచుఁ గడు, నాతురుఁడై పిలువఁ బిలువ ♦ నపుడె జరించెన్
సీతరమా రప్పింపఁగ, బోతర మిఁకఁ జెల్ల దుడిఁగి ♦ పోరా! యనుచున్. ౨౮౬

ఆ॥ అమ్మహాత్ముఁ డన్న ♦ నారక్కసుఁడు మిట్టి, పడుచు నోరు తెఱచి ♦ పైకొనంగ
నీరులోని యగ్గి ♦ నీరు గావించె న, మ్మౌనిఁ గోపవహ్ని ♦ మౌనివరుఁడు. ౨౫౦

క॥ దిగ్గన నుడిఁబడి వాఁ డటు, మ్రిగ్గిన సుర లలరి మౌని ♦ మండలపతిపై
నగ్గుణనిధిపైఁ గురిసిరి, పగ్గె నెఱయ నలరు లుత్స ♦ వ పర్వతమునన్. ౨౫౧

ఆ॥ తపముసిరికిఁ బెన్ని ♦ ధానంబు దాక్ష్యంబు, నెలవు నిలయు మెల్ల ♦ కళల కలిమి
కాత్మ తత్త్వసన్మ ♦ హాస్పద మమ్ముని, నియతి నీయెఱుంగ ♦ నిదియె రామ!

క॥ ఇదె చేరవచ్చితిమి త, త్పద మాశ్రమవరము పులుఁగు ♦ పలుకుల వరుసన్
విదితము లగుచున్నవి శ్రుతి, పదవీబోద్ధవ్యధర్మ ♦ పద్ధతు లనఘా! ౨౫౩

మ॥ అని యాబోధపరుండు బోధహారు బో ♦ ధాత్ముం బ్రబోధించుచున్
జనఁ జూపట్టె నగస్త్యమౌని వన మా ♦ చారప్రచారాంచితా
వన ముద్యత్సకలర్తుశోభనకలా ♦ వ్యాఖ్యాతదేవాధిభూ
వన మభ్యాగతలోకపావనము దీ ♦ వ్యద్భాన మవ్వారికిన్. ౨౫౪

—♦ అగస్త్యాశ్రమ వర్ణనము ♦—

సీ॥ మృదుదళమ్ములతోడి ♦ మెలఁకువ శోభిల్లు, తనులతాలలితవ ♦ ర్తనము గాంచి
ఫలసుమసన్నమా ♦ పత్తిభాసురతరు, వరసమంచత్ప్రిభా ♦ వము దలంచి
రోమంథవిస్మృతి ♦ రూఢ మీాలన్నేత్రి, శాంతినిష్ఠమృగప్ర ♦ చార మెంచి
ప్రసితవల్కలయోగ ♦ పట్టావృతస్వక, శ్రీకలాస్ఫురణంబు ♦ చిత్తగించి
తెఱఁగు లెఱుకపఱుచు ♦ ద్విజసూక్తు లాలించి
తెరువు గని తలఁగని ♦ దృష్టి మించి
రాముఁ డలరె నలరి ♦ రామె సౌమిత్రియు
నంతరాత్మ సుఖని ♦ రంతరముగ. ౨౫౫

క॥ దేవర్షిబ్రహ్మర్షులు, సేవింపఁగ బ్రహ్మపదము ♦ సిరి దనరు కలా
శ్రీవిలసనమున నందన, మేవలనుననేనిఁ బోల ♦ దిద్దాని నన్. ౨౫౬

ఆ॥ అమ్మునీంద్రు పదము ♦ నం దడుగిడ నాజ్ఞఁ, గొనినఁ గాక యింత ♦ గూడ దనెడు
రాము మత మెఱింగి ♦ రహి సుతీక్ష్ణమహర్షి, గురునిఁ జేర నరిగెఁ ♦ గువలయాక్షి!

క॥ ఆలో నాలోకార్ధస, మాలోకననిపుణుఁ డిట్టు ♦ లనె వేడ్కఁ దదీ
యాలోకనపరు లగు హరి, ణాలోకకు ననుజునకు స ♦ మంజసయుక్తిన్.

ఆ॥ మిత్తి గెలిచి జగము ♦ మేలున కియ్యాశ, నిలిచె నాశ లెల్ల ♦ నెఱిఁ దెరల్చి
యాత్మనిష్ఠుఁ డిమ్మ ♦ హామహుం డితనిఁ, బోల నొండు గలఁడె ♦ భువనములను.

ఉ॥ ఈఘను చేరికం గనిమె ♦ నీదిశ దక్షిణ నాఁ బ్రసిద్ధి శాం
తాఘుయు నయ్యె నియ్యెడ దు ♦ రాత్ములు గానరు కాంచు దృష్టియుక్
మోఘుమె కాని మేఫలిత ♦ ముం గనజాలదు త్రాసయుక్తి దై
త్యౌఘు మడంగి మున్నటి దు ♦ రాగ్రహముం బరఁగింప దెంతయుక్. ౨౬౦

సీ॥ దీర్ఘాయు వివ్మాని ♦ దితిజులఁ గాల్చి చి, చ్చఖిలార్చితుఁడు సుజ♦నాభిరతుఁడు
సేవించుకొందురు ♦ జేజేలు సిద్ధులుఁ, బరమర్షు లీసిద్ధ ♦ పదముఁ జేరి
ధర్మసంపాదన ♦ తత్పరు లీమెడ, నివసింతు రమ్మౌని ♦ నియతి దనర
జీవింపఁ డిచ్చటు ♦ జెనసి మృషావాది, కాముకుండు శఠుండు ♦ ఘాతుకుండు
నిందు మేను దొఱఁగి ♦ యేప్రాణి యేనియుఁ
బొందు తలఁపు నొందు ♦ పుణ్యలోక
మెల్ల తపసి గుమికి ♦ నిమ్మైన తలకట్టు
నాయ మగు తపః ప ♦ రాయణంబు. ౨౬౧

క॥ ఇమ్మగు సుకృతమ్మునఁ గల, యి మ్మౌనసితి మింకఁ గొఱఁత♦యెందును గనఁ బో
మిమ్మహి వనవాసము శ్రే, షమ్ము గ్రమింపం దలంతు ♦ సౌజన్యనిధీ! ౨౬౨

ఆ॥ కూర్తు నా యెడంద ♦ గూరిమి గలఁడు నా, యెడ నితండు శ్రేయ♦మెల్లగతులఁ
బొనరఁ జేయఁ జాలుఁ♦బుణ్యాత్ముఁ డిమ్మౌయి, వారి ఁొందు మేలు♦దారి యిందు.

క॥ అను నెడ నవ్వారు ముదం, బును మొనయుచు నుండ నరిగి ♦ ముని మహానివరే
ణ్యునిఁ గాంచె సద్గురూత్తం, సు నితాంతదయాపరీతు ♦ శుభగుణనిరతుక్.

—♦ సుతీక్ష్ణుఁడు శ్రీరామాగమనవార్త యగస్త్యునకుఁ జెప్పుట. ♦—

సీ॥ తపమునఁ బరకాష్ఠ ♦ దనరంగఁ దనరంగ, మంది వేఁడెడు వారి ♦ నరసికొనుచు
వరగుణం బాగ్నేయ ♦ శరణంబు శరణంబు, గా నున్నశిష్యుల ♦ కలిమిఁ గనుచు
ననిచిన సద్భక్తి ♦ లను వార లను వారఁ, జెనయుమహాహ్లాదయ ♦ స్థితి కలరుచు
రామమంత్రార్థసా ♦ రము నించు రమ మించు, వేడ్క రసాంచిత♦విస్మృతికి నుచు.
బ్రహ్మసామ్రాజ్యపదపట్ట ♦ భద్రిభద్రి
వేషగుణ వేదపదవీన ♦ వీనవిధి వి
శేష తేజోనిధిముఖ్యప్ర ♦ సిద్ధి సిద్ధి
దొలఁకఁ దులకించు నమ్మహా ♦ త్మునకు మ్రొక్కి. ౨౬౫

ఆ॥ బ్రహ్మమూర్తి! యిదె ప్ర♦పంచావనము పొంటె, రాముఁ డనుజుతోడ♦రమణితోడ
నాశ్రమాంతసీమ ♦ నలరుచు నున్నవాఁ, డానకై త్వదర్చ ♦ నార్థి యగుచు.

మ॥ అను నంతం దన యంతరంగమున బ్రాం ♦ గాకాశగంగాచితిం
గని మేల్మే లని కూడి యాడ నరరే ♦ కా దంటినే నామనం
బున నున్నంతలు దోఁచె జాగు తగునే ♦ బ్రాం డింతలోఁ దోడితెం
డు నవీనాభ్యుదయంబ యిందఱకు నె ♦ ట్లు న్భాగ్యయోగంబునన్. ౧౧౭

క॥ రావలెఁబో నొకయెడ నిలఁ, గావలెనే మమ్ముఁ జూచు ♦ కలిమి కనుజ్ఞల్
కావలెనే మాసుకృతము, తేవలెనే యింతప్రొద్దుఁ ♦ దేఁకువ వెలయన్. ౧౧౮

మ॥ అని యానందమయాత్ముఁడై పొదలుచో ♦ నాశిష్యరత్నంబుతో
ననువా వర్గము సేరిరాఁ జని మహా ♦ త్మా! రామ! నీవారు నీ
వనివార్యుల్గదె రావె తండ్రి! యనుచున్ ♦ హాయిం గనం గాంచుచున్
గొని తెచ్చె న్మహితోత్సవోర్మికలనా ♦ కూలంకషత్వస్థితిన్. ౧౧౯

వ॥ ఆశ్రమప్రవేశ మనుసంధానించి యించు వేడుకమెయిం దత్తత్ప్రదేశంబుల విశేషంబుల నెల్ల నామూలాగ్రంబుగా వివరించి తెలుపుచు మఱియు శ్రుతిప్రతివేశంబులనందగు బ్రహ్మాస్పదంబును వీతిహోత్రశరణంబును విష్ణుపదంబును మహేంద్రమండపంబును రవిసోమమండలంబులును భగకౌబేరధాతృవిధాత్రనిలానంతగాయత్రీవసువరుణకార్తికేయధర్మాఖ్యస్థానంబులును నదసీయమాహాత్మ్యమ్ములును వేర్వేర నుగ్గడించుచు సముద్భూతప్రభూతహర్షు లగు నవ్వారలం గొనిచను నయ్యవసరంబున. ౧౨౦

—♦ అగస్త్యుఁడు రాము నెదుర్కొనుట ♦—

ఆ॥ అగ్నిహోత్రహోమ ♦ మాచరించి సమంచి, తార్ఘ్యపాత్రహస్తుఁ♦డై తనర్చి
మౌనిమండలీస♦మావృతుం డగుచు రా, ముని మునీంద్రుఁడెదురు♦కొనెఁ బురంధ్రి!

శా॥ తేజోరాశివిశేషదృశ్యకలనా ♦ దివ్యప్రభావాఢ్యు న
వ్యాజప్రోద్భవు సానుజు న్సహమహీ ♦ జానంతకల్యాణని
ర్వ్యాజస్ఫూర్తిని గన్నులారఁ గని తా ♦ నవ్వాసు నవ్వారిగా
నోజన్మిఱక మీఱు తృప్తిఁ గని రా ♦ యుష్మన్నిజా నాథకా! ౧౨౧

ఆ॥ అంతలోనె రాముఁ ♦ డతివతో ననుజుతో, నందరాని ఫలమె ♦ యబ్బె నందు
కొనుఁ డటంచుఁ గూర్మి♦గొనకొన సాష్టాంగ, వినతిఁ గూర్చె మునికి♦విశ్వవంద్య!

ఉ॥ వారును నట్లొనర్ప ముని ♦ వారని కౌతుక మూఱ వీరు నా
వా రను బంధుయోగ మని ♦ వార్యముగా ననువార రండు న
న్నారయవచ్చినారె శుభ ♦ మా సుఖ మంచితమా యటంచు నా
తారకనాము రాము సము ♦ దారత మీఱఁ గదించెఁ గౌఁగిటన్. ౧౨౩

తే॥ అగ్నిపరిచర్య జరిపి రా ♦ నయ్యె జాల, మట్లుగా కరుచేర మే ♦ లనువుపడదు
నీ వతిథిమాత్రుఁడవె జగ ♦ న్నేత వఖిల, కర్మసాక్షి వదియు భవ♦త్కలనగాదె.

ఆ॥ ఎంత మంచి కాల ♦ మేమందు నాభాగ్య, మిట్టి యతిథి యెవరి ♦ కెన్నఁ డబ్బు
ఫలముఁ గంటిఁ గాదె♦భవముఁ గాంచిన నాఁటి, కలిమి కెల్ల నిదియ♦కలిమిగాఁగ.

క॥ అని ముచ్చట లాడుచుఁ ద, త్తను సంగతిఁ బులక లొదవఁ ♦ దతహర్ష జలం
బను వరయుచుండ వారలఁ, గొని చనె నంతర్గృహమున ♦ కు న్మునివంద్యా!

క॥ పూజించెఁ బూజనీయునిఁ బూజితు లగు తోడివారిఁ ♦ బుణ్యోదయ వి
భ్రాజితుఁడు తపోధనుఁడు స, మాజమువా రెలమిఁ గన స♦మాహితుఁ డగుచున్

ఆ॥ ఇష్టభోజనముల♦నెలయించి వరయోగ, మిదియె యనుచు నొడివి♦యెల్లవారు
సంతసింప రాము♦మంతనమునఁ గని, పలికె దోసి లొగ్గి ♦ భాసురాంగి! ౨౮౯

క॥ శశినిభముఖ! కలతత్త్వము, విశదము గావించువాఁడ ♦ విధి వేఁడఁ గుభా
రశమకృతికి నాఁ డీవు క. లశాబ్ధికడ వల్లె యనిన ♦ లా గే వింటిన్. ౨౯౦

—♦ అగస్త్యుఁడు భోజనాద్యనంతరము శ్రీరాముని తత్త్వము ప్రకటించుట ♦—

ఆ॥ నాఁటఁగోలె నీదు ♦ నామరూపమ్ము లే, మెడఁ దలంచుచుంట ♦ యే తపమ్ము
గాఁగ నుంటి వీరుఁ ♦ గలసి యన్నిటఁ దోడి, వారుగా నిరీక్షి ♦ వఱలుచుండ.

సీ॥ ఎక్కటి నీ వుందు ♦ వెల్లసృష్టికిముందు, నిర్వికల్పసమాధి ♦ నిష్ఠ దనర
ననుపాధికుఁడవై త్వ♦దాశ్రయత్వద్విష, యయు మహామాయ నా♦నై యొకర్తు
నిజశక్తి నిర్గుణు♦ ని న్నావరించుట, నప్రాకృతునిగ వే ♦ దాంతవేత్త
లరసికందురు దాని ♦ నందురు మూలప్ర, కృతి యని కొందఱు ♦ కెలని యోగ
మాయ యందు రదియు ♦ మలసి సంసృతిబంధ
మై యవిద్య నాఁగ ♦ నై బహూక్తు
లందు క్షోభమాణ ♦ యై మహత్తత్త్వంబు
గను స్వసన్నిధాన ♦ కలన రామ! ౨౯౨

ఆ॥ నీప్రకాశ ముచట ♦ నెఱయ నహంకార
మమ్మహత్పదార్థ ♦ మందుఁ బొడము
నదియు మూఁడు గానము ♦ లంది సాత్త్వికము రా
జసము తామసమను ♦ సంజ్ఞ లెనయు ౨౯౩

ఆ॥ తామసమున సూక్ష్మ♦తన్మాత్రభూతముల్, స్థూలభూతములును♦సొరిదిఁ దోచు
నింద్రియమ్ములు రాజ♦సేచ్ఛ జనించు నా, రెండు సాత్త్వికమున♦నుండు నెగియు.

ఆ॥ ఎల్లసూక్ష్మములును ♦ నెనసిన యచ్చటు, లింగదేహ మందు ♦ లీల స్థూల
భూతసంగ్రహమునఁ ♦ బుట్టె విరాట్టను, రంగ నగుఁ జరాచ ♦ రము జగంబు.

క॥ మాయాగుణభేదంబున, నాయె జగత్సర్జనావ ♦ నాంతేచ్ఛల నీ
కా యజహరిరుద్రాఖ్య ల, మేయప్రాభవము దాన ♦ మేకొనె నభవా! ౨౮౬

తే॥ జాగరస్వప్నసుప్తులు ♦ సంభవించు, మూఁడు గుణముల బుద్ధిన ♦ మూఁడవస్థ
లిన్నిఁటికిని వివిక్తుండ♦వీవు రామ!, చిన్మయుఁడ వవ్యయుఁడవు నై♦చెలఁగుకతన.

క॥ మాయాకృతి సృష్టిక్రియ, నీయంగీకారముననుఁ♦నెగడుటచే వి
న్నాయదనున గుణవంతుఁడ, వో యందురు దానిదైన ♦ పొదలిక ననఘా!

సీ॥ అదియు విద్య యవిద్య ♦ యని ద్వివిధాకృతి, వెలయు నివృత్తిప్ర♦వృత్తు లనఁగ
నారెంటి మార్గంబు ♦ లనువొందుఁ ద్వద్భక్తి, నిరతులు వేదాంత ♦ నిష్ఠులునగు
వారలు మొదలింటి♦వరుసనె నిన్నుఁ జేరి, ముక్తు లౌదురు వారి♦మొనయఁబోదు
సంసృతిబంధం బ ♦ సారు లన్యు లవిద్యఁ, బడి నిత్యసంసార ♦ బద్ధు లౌదు

రమృతమయి విద్య రూపింప ♦ ననదుగాఁగఁ
దోఁపఁ జెడ్డతలంపులు ♦ దొరకొనంగఁ
జెఱుదు రేనాఁటికివి ముక్తిఁ ♦ జెందసీని
యఘవితతి తమ్ము ముంప న ♦ య్యాధము లధిప! ౨౮౯

ఆ॥ వేయు నేల రామ! ♦ వివరింతు నాకన్న, యంతవట్టు సజ్జ ♦ నానురక్తి
కన్న లేదు వేఱు♦గతి యయ్యదియ యున్న, నరుఁడు గాంచు ముక్తి♦నంద్యపదవి.

మ॥ సమచిత్తు ల్విరతేషణు ల్వినిహతా ♦ శాపాశులున్ శాంతిదాం
తిమనస్కారసమేతు లాత్మరములు ♦ స్నిభక్తులు న్నిత్యని
ర్మములుం ద్వత్పరసర్వకర్ము లతిని ♦ ర్మాయు ల్సుసంతృప్తులున్
యమముఖ్యాధ్యులు నాఁగ నొప్పుదురు దే ♦ వా! సజ్జను ల్భూస్థలిన్. ౨౯౧

ఆ॥ సాధుసంయమమ్ము♦సమకూరెనేని ద్వ, త్సంగ మొదవుఁ ద్వత్క♦థాశ్రవణము
నందు రతియుఁ బొసఁగు♦నందు భవద్భక్తిఁ, గనుఁ బ్రబోధ మవలఁ♦గాంచు ముక్తి.

తే॥ కాన నీపయిఁ బ్రేమల ♦ క్షణ ప్రపత్తి, యొక్కనాఁడును దలఁగక♦యుండుగాత
తనకుఁ ద్వద్భక్తులం దెప్డుఁ ♦ దవులు పీడ, రాని దన నవుఁగావుత♦ రాఘవేంద్ర.

క॥ చిరకాలాచరితతప, శ్చరణ మిదే శరణ మని ప్ర♦శంసించె భవ
చ్చరణార్చఁ గూర్చి యట్లే, శరణ్యుఁడవు గావె రామ! ♦ చర్చింపంగన్. ౨౯౪

ఆ॥ ఏది యెట్టు లైన ♦ నేమి జానకితోడ, నెలయు మయ్య! నాదు ♦ హృదయపీఠి
నాస్మరణమె నన్ను ♦ నాయాసమున భవా, ర్ణవముఁ గడవఁ బెట్టు ♦ రహిఁ దనర్చు.

క॥ అని పొగడిన మునిఁ గని మీ, యనుమతి మెయి నన్నియును స ♦ మగ్రము లగు మీ
కనరానిది కానరానిది, యును గలదే యనిన నతిస ♦ ముత్సుకుఁ డగుచున్.

—♦ అగస్త్యుఁడు శ్రీరామునకు దివ్యచాపశరాసిశరధుల నొసంగి రాక్షససంహారముం గూర్చి బోధించుట ♦—

ఆ॥ ఇది సమృద్ధరూప ♦ మిక్ష్వాకుకులదీప!, కార్ముకంబు విశ్వ ♦ కర్మనిర్మి
తంబు వైష్ణవంబు ♦ తపనీయమణిరత్న, భూషణోజ్జ్వలంబు ♦ పూజితంబు. ౨౯౭

క॥ ఈశరము బ్రహ్మదత్తం, బీశరధులు రెండు నక్ష ♦ యేషువు లివి ము
న్నాశరుల ద్రుంచి జయ మిడె, శ్రీశుఁడు గొని వాసవునక ♦ ధీశత నెలయన్.

క॥ ఈయసియు నట్లమోఘ మ, మేయగుణం బిన్ని నీదు ♦ మే లరసి యిడ
న్నాయొద్ద నునిచె నిందుఁ, డోయధిపా! కొనుము గెలువు ♦ మురుతరశక్తిన్.

ఆ॥ అడిచిపడెడు దర్ప ♦ మడర నెల్లెడ దైత్య, మండలంబు నీదు ♦ మర్మ మరయు
వలనె యింక భూమి ♦ భరముఁ బాపఁ దలంచి, తది పొనర్పు మొంటి ♦ నడుగ నేల.

తే॥ అనుచు నవి యెల్ల హరికి ♦ సమర్పణంబు, సేసి నిశ్శేషచులుకిత ♦ సింధునాథ
జలభరుం డిట్టు లనె సంప్ర ♦ సాదభరిత, మానసముఖాబ్జుఁడై పూజ్య ♦ మానచరణ॥

సీ॥ పరితుష్టి నొందితిఁ ♦ బడతి తమ్ముఁడు నీవు, నాయింటి కేతెంచు ♦ నయముఁ గాంచి
బడలితి రిందఱుఁ ♦ బరువంపు టిగురులు, గసిగందె నడుగులు ♦ కాననగతి
లలితాంగి యిద్దేవి ♦ లావఱఁ జొక్కెడు; నిట్టికష్టము లెన్నఁ ♦ డెఱుఁగ దబల
తన కరుంధతి సాటి ♦ యనవచ్చుఁ గాకొండ్ల, కనయు మే యిమ్మెయి ♦ ననిచి మెలఁగఁ
గానఁ బతిదేవతామణి ♦ కలికిమిన్న
లోకమున తరబడి గాదు ♦ లోల లగుచు
ననుసరింతురు సుఖస్థితి ♦ యమరెనేనిఁ
దలఁతు రెడయుంగ నిక్కట్టు ♦ దవిలెనేని. 30౨

తే॥ మెఱుఁగుఁదీఁగెల సడి నొంట ♦ మెలపుగాంతురు,
ములుకు లట్టులు తైక్ష్ణ్య ♦ మును వహింతురు
పవనగరుడప్రసక్తిని ♦ జవన లౌదు
రాండ్రు గావ నియమవృత్త ♦ మద్భుతంబు 303

క॥ ఎల్లయలంకారమ్ముల, కిల్లుగ నలువొందె నాదు ♦ నిక్క సుమిత్రా
ఫుల్లాబ్జాక్షి కొడుకు నీ, విల్లలితాంగియును ద్రొక్క ♦ నీనాఁ డనఘా! 30౪

ఆ॥ నిలువుమయ్య నీదు ♦ నెల విది నీయిచ్చ, వచ్చినన్నినాళ్ళు ♦ వనితతోడ
దమ్ముఁగుఱ్ఱతోడఁ ♦ ద్వద్భజనమునఁ గా, లముఁ గ్రమింతు మిట్టి ♦ క్రమము నెఱయ.

— ♦ శ్రీరాముఁడు మౌని వీడ్కొనుట. ♦ —

చ॥ అనునెడ రాముఁ డిట్టు లనె ♦ నంజలిఁ గూర్చి మహాత్మ వహ్నిక
ల్పుని నినుఁ జేరి కొల్వఁ దలఁ ♦ పు ల్ఫలియించు మనుష్యకోటి కం
చనుటయు నబ్రమే నిలుతు ♦ మమ్మొయి నిమ్మహితాశ్రమమ్ము గా
కనువగు నొక్కతావు గని ♦ యానతి సేయుము సమ్మదమ్మునన్. ౩౦౬

ఆ॥ పావనాత్మ! నీదు ♦ భావమ్ము గైకొన్న, యెలమి మెచ్చు గంటి ♦ మింతకన్నఁ
గలదె శుద్ధధర్మ ♦ కలన మాకాంచిన, భవము ఫలము సిద్ధిఁ ♦ బడసి వెలసె.

మ॥ ఫలమూలాంబుసమగ్రతాకలన మై ♦ భాసిల్లు నే నీమ యా
విలభావం బనరాని యన్నెలవున ♦ న్వేశ్మంబు నిర్మించి యా
వల నావంతయుఁ జింత లేక నిల భ ♦ వ్యశ్రీలకుం దానకం
బలఁతిం బోక లభించుఁ ద్వాదృశసమా ♦ హ్లాదోదయ మ్మెమ్మెయిన్. ౩౦౮

ఆ॥ అనిన సంతసించి ♦ యంతలు సేయంగఁ, దలఁచి యిచ్చ నిట్లు ♦ దరలివచ్చి
నాడ వనెడు మేలి ♦ జాడఁ గన్గొంటి నా, తపము పేరి త్వద్ర్వ ♦ తమున రామ!

ఉ॥ ఇచ్చట నిల్వు మంటి నివు ♦ డే యటఁబొమ్మని సమ్మతింప నా
కిచ్చ జనించెఁ ద్వచ్చరిత ♦ మెవ్వని కెట్టు లెఱుంగఁగా నగున్
బొచ్చెము లేక నిన్నుఁ గని ♦ భూపతి గాంచె యయాతి భాతి సం
విచ్చతురానుభావ్యగతి ♦ విచ్చెఁ దమం బఖిలాప్తకోటికిన్. ౩౧౦

తే॥ నీప్రతిజ్ఞాతకాలమ్ము ♦ నియతి నెఱయ, నయ్యె నయ్యెడ నివసించు ♦ మయ్య యెద్ది
యెల్లకృతిసిద్ధులకు మూల ♦ మే యనంగ, నగునొ యద్దాని తెలియఁగేను ♦ నరయువాఁడ

ఆ॥ అని ముహూర్తమాత్ర ♦ మాధ్యాన మొనరించి, ధర్మతత్త్వసంవి ♦ ధాననిపుణుఁ
డనియెఁ దపసి తండ్రి! ♦ యదె ఫలమూలోద, కాఢ్యమైన కాన ♦ నాంతరమ్ము.

క॥ పంచవటీసంజ్ఞితము ప్ర, పంచావనచతుర యదియు ♦ బహుమృగసంభా
రాంచితము పుణ్యతీర్థము, మించు న్గోదావరీస ♦ మీపగ మగుచున్. ౩౧౩

తే॥ రహిఁ బొనర్చు వివిక్తమ్ము ♦ రమ్యతలము, నగుచు సీతామహాదేవి ♦ యంతరాత్మ
కచటునకు దీనికి ద్వియోజ ♦ నాంతరమ్ము, గలదు కమలాకరవికాస ♦ కలనఁ దనరు.

మత్తకోకిల॥ నిత్యపుష్పితకాననం బగు ♦ నీకు నాకును సన్నిధి
ప్రత్యయం బొనఁగూర్చుచుండును ♦ భావిభావరసోచితం
బత్యయంబు లడంపఁ జాలుదు ♦ వన్న! యచ్చట నున్న సం
ప్రత్యభిజ్ఞుఁడ వైన నీనుడి ♦ భాసిలు న్వరమా సడిన్. ౩౧౫

పృథ్వి॥ మధూకవనమాలికా ♦ మహి యదే కనుంగొంటివే
విధుప్రతిభటాననా! ♦ వెలయు దానిక య్యుత్తరా
పథం బగు పథంబు సు ♦ ప్రథము మఱ్ఱి లక్ష్యంబుగా
విధింపు పయనం బట ♦ న్విదితమా గిరిప్రాంతతన్. ౩౧౬

క॥ ఆపంచవటీస్థలమునఁ, గాపుర మొనరింపుమయ్య! ♦ కలమట్టునకుం
దాపసులు గొలువ వత్తురు, శ్రీపతి వీ వనుచు నిచ్చఁ ♦ జెలఁగెడు మదితోన్.

ఆ॥ అని యగస్త్యముని స ♦ మాఖ్యాన మొనరింప. విని జగన్మయుండు ♦ విశ్వసించి
యధికభక్తి నెఱఁగి ♦ యామంత్రణము సేసి, తరలె నతఁడు వనువఁ ♦ దరళనయన!

—♦ శ్రీరాముఁ డగస్త్యు సెలవుఁగొని పంచవటి కేగుట. ♦—

క॥ అమ్మును లుదకాంతమ్మున, సమ్మత మనరాని యొక్క ♦ జతనమ్మున నొ
క్కమ్మడి నిలఁబడి చూడఁగ, నమ్మెయి వీడ్కోలు నూపి ♦ రగకులభూపా!

క॥ సన్నద్ధు లగుచు వడి న, య్యన్నయుఁ దమ్ముఁడును ♦ నడిచి యంతరమున సం
పన్నయయి మహిజ రా న, భ్యున్నత మప్పొలము సేరి ♦ రుడురాజముఖి! ౩౨౦

—♦ శ్రీరామునకు జటాయువు కనఁబడుట. ♦—

వ॥ మధ్యేమార్గంబున నలువొందు న్యగ్రోధవృక్షంబున సుమహాకాయుండు నతి భీమపరాక్రముండు నగు నొక్క సుపర్ణజాతి పక్షివరేణ్యుం గాంచి రాక్షసుం డగునేమొకో యని శంకించి నీవెవ్వండ వోరీ! యని యవ్వార లడిగిన నప్పతత్త్రి వంశాభరణంబు వారి చరిత్రం బెల్ల నారసి సౌమ్యస్నిగ్ధమధురం బగు వాచా రంభంబున వత్సా! యని రామునిం బేర్కొని వాత్సల్యంబు పెను పొంద గుణాంబుధీ! యేను నీతండ్రికిం బ్రియసఖుండను గాని యన్యుండఁ గాను దయార్ద్ర దృష్టుల నింపు నింపవే యనవుడు నమ్మహానీయుండు పితృపదశ్రవణంబున నవ నవోన్మిషచ్చిత్తవర్తనుండై యాతని సంభావించి యన్నా! నీదు కులగోత్రనామ ధేయంబు లెఱిఁగింపవే యనిన నాతండు వల్లె యని యిట్లనియె. ౩౨౧

—♦ జటాయువు వృత్తాంతము. ♦—

క॥ భద్రముఖా! తెలిపెద ని, ర్ణిద్రరఘూత్తంసకులమ ♦ ణివి నీ కిట న
క్షుద్ర మగు సంగ్రహమున స, ముద్రితము మదన్వయంబు ♦ మూలం బెల్లన్.

స్రగ్వి॥ నిత్యయోగాంచితో ♦ న్నిద్రలక్ష్మీస్మకలా
ప్రత్యయోపాత్తసం ♦ పద్విపద్భావనా
యత్యవక్రప్రకా ♦ రాధిగమ్య ప్రథా
సత్యచిత్సౌఖ్యసం ♦ సత్తిలక్ష్మ్యాత్మకా! ౩౪౯

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునం
దరణ్యకాండంబునం దృతీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



యెఱిఁగి నిజము సేయ ♦ నెంచి బిడ్డలఁ బిల్చి
వార్తఁ దెలిపి తురగ ♦ వాల మెనసి
కప్పొనర్పఁ డనినఁ ♦ గాదని రందు శే
షప్రముఖులు ధర్మ ♦ సంశ్రయమున. 3.౨౪

వ॥ తక్కినవారును జ్యేష్ఠుల మతంబ యనుసరించినం గోపించి మీర లెల్లరు నొక్క యాగంబున హోమకుండంబునం బడి నశియింతు రని శాపం బొసంగిన వెఱచి యాయురగులు శాపమోక్షణంబు ప్రసాదింపు మని జననిం బ్రార్థించిన నాపె నాశాసించిన కర్జంబు సమగ్రంబుగావించినవారి కీయపాయంబు సంభవింపంబోవ దనిన నందుఁ గొంద ఱద్దారాత్మ్యమ్మున కొడంబడి. 3.౨౫

ఆ॥ కశ్యపప్రసాద ♦ కలన జనించిన, కాద్రవేయు లెల్లఁ గామరూప
ధరుల యాట నల్ల♦హరిపుచ్ఛ మసితంబు,గాఁ బొనర్చి రొంటఁ♦గదిసి రామ!

సీ॥ ఘనుఁడు కశ్యపు ననుఁ♦గ్రహమునఁ దానును, మున్ను గర్భము దాల్చి♦మొనసి వినత
రెం డండముల్గనె ♦ నండము ల్వెక్కలు, గనెఁ గద్రు వయ్యవి♦కడఁగి యవియ
నైదు నూరేండ్లకు ♦ నైరి పన్నగు లది, గనుఁగొని యద్దాని ♦ కలిమి కులికి
తనగ్రుడ్లలో నొంటి ♦ దార్కొని చిదుమంగ, నరుణుం డనూరుఁడై ♦యవతరించి
తల్లి! యింక సవతి ♦ దాస్యం బొనర్పంగ
నౌదు వనిన నలికి ♦ యతని వేఁడ
నొండు గ్రుడ్డు గాచి ♦ యుండు మం దొక్కండు
పుణ్యుఁ డధికబలుఁడు ♦ పొడము ననియె. 3.౨౬

వ॥ అమ్ముద్దియముద్దరా లమ్ముద్దులాని కలకపాటునం దొలఁకిన యలుక కులికియుఁ బాయరాని పుత్రప్రేమమ్మున నమ్మప్పున కొప్పుకొని యన్నా! యిన్నేఱి నెంత కాలం బొడ్లు పఱపం బడుదాన నని యడలిన నమ్మహామహుండు కొండొక యేనూరేండ్లు గడచిన వాలఖిల్యప్రభావంబున కలిమి నింద్రప్రతిభటుండై జనియించు దానం జేసి పక్షీంద్రుఁ డనం దనరారి సురేంద్రునిం గెలిచి యమృతం బొడిసి పుచ్చుకొని యాభుజంగజాతి కొసంగు నెపంబున నీదు దాస్యం బీగంగల వాఁ డని యాయమ నూఱడించి చని సప్తాశ్వుం గొలిచి తద్రథసారథియై యాతండు పెనుపొందె. 3.౨౭

ఉ॥ కద్రువతోడి పందెమునఁ ♦ గానని కర్మము గాఁగ నోడి ని
ర్నిద్రనిశాక్షి యవ్వినత ♦ రీతిఁ దొఱంగి సపత్ని కూడిగం
బద్రితవృత్తిఁ జేయ సుతుఁ ♦ డై విహగేంద్రుఁడు తోఁచి యాపె ము
న్నిద్రిఁ దొలంచె స్త్రీయ మగు ♦ పున్నెము పూరుషభావము న్దగన్. 3.౨౮

వ॥ పదంపడి యమ్మహాత్ముండు గరుడుండు జగదీశు వాసుదేవుని సేవించి తదీయాను
గ్రహంబునం దద్వాహనంబై కరంబు డంబు మీఱె. ౩౩౦

ఆ॥ రాఘవాన్వవాయ ♦ రత్నంబ! యయ్యైను, యంత శ్యేని యను పొ ♦ లంతియందుఁ
గాంచె స్వానుభావ ♦ సంచితతనుల మ, మ్మరుణుఁ డిరువురను స ♦ మగ్రబలుల.

వ॥ సంపాతి యనువాఁ డగ్రజుం డేను గొండొక జటాయు వనెడువాఁడ నొక్కకారణం
బున నన్నయు నేను భిన్నపదస్థులమై యొండొరుల వార్తలరయం గానక
యుండి బెండువడి యండకై వేఁచి యున్న నన్నుఁ గొండొక కాలంబునకు మీ
తండ్రి దశరథసార్వభౌముండు నిండు చెలిమి మేకొనం గైకొని తనయంతవానిగా
సంభావించి గారవించుచునుండె. నియ్యది నాదు వృత్తాంతంబు. ౩౩౨

ఆ॥ అమ్మహానుభావుఁ ♦ డరిగె నే నుంటి మా, యయ్యలార! కన్ను ♦ లార మిమ్ముఁ
గంటి గంటిలేని ♦ కలిమి గైకొంటి నా, వంటి సుకృతి గలఁడె ♦ వసుధలోన.

వ॥ అని నెయ్యంబు తియ్యంబుగాఁ బలికి యప్పతంగపుంగవుం డయ్యాజితనయాగ్రణి
హితనయాగ్ర్యమణి నల్లనం గనుంగొని. ౩౩౪

ఆ॥ అన్న! మీర లిమ్మ ♦ హారణ్యమున వసి, యింప వచ్చినార ♦ లింతితోడ
గడుసురక్కసులకుఁ ♦ గాపురం బిప్పాలం, బట్లుగాన నొక్కఁ ♦ డడుగువాఁడ.

క॥ తోఁడై యుండెద మీ రే, వాడ కరిగిరేని వచ్చు ♦ వల నరయుచు నే
వాఁడుఁ గనువిచ్చి చూచుట, కోడఁగ నాబలిమికలిమి ♦ యొప్పారంగన్. ౩౩౬

—♦ శ్రీరాముఁడు జటాయువుసాయ మంగీకరించుట. ♦—

ఆ॥ అనువు పడున యేని ♦ నంగీకరింపఁగ, నగు నటన్న నింత ♦ కధిక మైన
మే లొకండు గలదె ♦ మేకొనఁగంటి మి, తండ్రిచెలిమిగూర్చు ♦ తత్ఫలమున.

క॥ అని యాతనిఁ దోడ్కొని యటఁ, జని వాఁ డెఱిఁగించుచుండ ♦ జనకుని వార్త
ల్విని సంతసమునఁ బొదలుచు, మొనసిరి పంచవటిఁ జేర ♦ ముగ్ధమృగాక్షీ!

ఆ॥ అరులఁ గాల్చు చిచ్చో ♦ యన రాముఁ డచ్చోటు, సేరి మెఱసె మిత్ర ♦ సిద్ధి కొసరు
గాఁగ లక్ష్మణుండు ♦ కడలేని గొనముల, బ్రో వెడమ్ము పడని ♦ ప్రోఁపు నెఱప.

క॥ దండఁ గల కొండచఱియల, నుండ ఖగేంద్రున కనుజ్ఞ ♦ యొసఁగి కడఁగి య
య్యండజవాహనుఁ డనుజుని, దండిమగనిఁ గాంచి పలికె ♦ ధరవంశమణీ!

—♦ శ్రీరాముఁడు పర్ణశాల నిర్మింప లక్ష్మణున కాజ్ఞయిచ్చుట ♦—

మ॥ మునినిర్దిష్ట ప్రదేశముం బెరసి యి ♦ మ్మున్ గంటి మిమ్మేదినిన్
ఘనపర్ణాంచితశాల మే లగు కృతిం ♦ గల్పింపఁగా నీదు నె
మ్మన మం దారసి చూచి యొక్కతల మా ♦ మంత్రింపు మద్దానిచెం
త నదీతీర్థసరోవనద్రుమలతో ♦ ద్యచ్ఛోద్య మొప్పారఁగన్ ! 380

క॥ తృణజలకాష్ఠసమృద్ధ్యను, గుణ మగు దేశంబె సమను ♦ కూల మగు నై
పుణిగలవు గానఁ గనుఁగొని, గణియింపుము నీకు నాకు ♦ తన్మజ కనువుగన్.

తే॥ అనినఁ గేల్మోడ్చి యన్న ! నీ ♦ వరసి పనుచు
పనుపున మెలంగువాఁడ నీ ♦ పదియు వేల
వత్సరంబులు నే నొండు ♦ వలను గాంచు
పాటియె యనుజ్ఞ సేయుము ♦ ప్రతిభ నెఱయ. 383

క॥ అను నాతని వినయశ్రీ, కినవంశాభరణ మెక్కు ♦ డెలమి న్గని తా
ననుపమ మగు పద మొక్కం, డనుపద మీక్షించి యరసి ♦ యనుమోదమునన్.

ఆ॥ చేర ర మ్మటంచు,సిద్ధ మియ్యది యంచుఁ, జేయి చేయి గూర్చి♦సిరిఁ దనర్చి
పలికె ననుజుతోడ ♦ భాషితంబుల జాడ, యమృతరసము నింప ♦ ననుమతింప.

క॥ ఇచ్చోటన మేలిమిఁ గను, మిచ్చ న్నెలకొలిపి తళుకు ♦ లే డెలిపెద సం
పచ్చయసమృద్ధి మీఱి వి, యచ్చరసంతృప్తిఁ గూర్చు ♦ టనువుపడంగన్. 386

సీ॥ ముని దెల్పి నట్టులు♦ముదిత గౌతమి దీని, మొనసి యొప్పెడు గాన♦మ్ముల ప్రసక్తిఁ
జెంగట రవిదీప్తి ♦ కిం గూర్చు సురభిళ, పద్మ పద్మిని కవి ♦ ప్రతిభ లోలయఁ
గ్రీడాద్రి సంపత్తి ♦ గిరికొను భ్రమరకులఁ గేకికేకలఁ గ్రేవ ♦ గిరివరమ్ము
సుమఫలతరులతా ♦ శోభితవనరాజి, రాజిల్లుఁ దీర్ఘసా ♦ రము గ్రహించి
యనఘ ప్రత్యక్షలక్ష్మి యి ♦ య్యదియ నాఁగఁ
గరిఘట ఘటింపఁ జాలు ని ♦ క్కముగ విజయ
మెల్ల యోగ్యత్వములకుఁ దా ♦ నిల్లట మగు
పర్ణశాలకు నిన్నెల ♦ పాడి మొదవు. 387

క॥ ఇది పుణ్య మిది వివిక్తం, బిది తీర్థం బిన్ని యొదవు ♦ నేమెడ నొకటన్
మది ముదమున నెనయింపుము, గుదికొను సంపదలకెల్లఁ♦గుదురు రిదె యనఁగన్.

క॥ రుచియించుమయ్య ? యిచ్చో, నచిరంబుగ నొక్క వేశ్మ ♦ మరిదుర్గశ్రీ
ప్రచురంబు డంబు నీదగు, రచనాకౌశలి గణింప ♦ రమణీయగుణా ! 389

క॥ అని తెలిపిన రాముని శా, సనము శిరమ్మున ధరించి ♦ సౌమిత్రి పుర
మ్మొనరించెను మనువంశం, మ్మున కలనల చౌ ప్పెలర్ప ♦ మునివంద్యపదా !

సీ॥ కల మృత్తికల గోడ ♦ కాల్ద్రొక్కి ఘట్టించి, స్తంభము ల్భిత్తిక ♦ ల్సంఘటించి
యాశమీశాఖల ♦ నగు దూలము లమర్చి, యుపకరణమ్ము ల ♦ ట్లొనరుపఱిచి
వంశాస్తరణములు♦ వైణవమ్ములు గాఁగ, మొగకొల్పి దృఢపాశ♦ముల బిగించి
శరకాశకుశపత్రి ♦ సంఛాదనమ్మును, మొనయించి వాకిళ్లు ♦ తనరఁదార్చి
చదురు లరుగులు గదులు పూ♦జాగృహములు
సముపహితములుగా నేర్మి ♦ సంతరించి
సంవృతివృతిప్రసంగ మ్మె ♦ సంగఁ బర్ణ
శాల సువిశాలఁ గూర్చె ని ♦ క్ష్వాకుకులుఁడు. ౩౫౧

క॥ తతలక్షణపదము సమీ, కృతతల మతిరమ్యమును సు ♦ కీర్తితమును నై
వృతభావుకవిధిసంప, త్ప్రితతి యనం దనరి పత్ర♦భవనం బొప్పెన్. ౩౫౨

క॥ అలఘుబలవిక్రముఁడు వాఁ, డలరుచు గౌతమిని స్నాతుఁ♦డై నళినములున్
ఫలములుఁ గొని తెచ్చి సదన, బలిపూజావిధు లొనర్చె ♦ భవ్యవిలాసా. ౩౫౩

—♦ లక్ష్మణుఁడు నిర్మించిన పర్ణశాలం గాంచి సీతారాము లానందించుట ♦—

తే॥ అన్న ! గనుఁగొనుమన్న మి ♦ న్నంది దాని
యందమును జందమును మేల్మి ♦ యనఘతయును
మెలఁతతోఁ గాంచి మే లెంచి ♦ మించి యనుజుఁ
గౌఁగిటఁ గదించి పలికె శ్రీ ♦ కాంతుఁ డజిత ! ౩౫౪

తే॥ భావమును గృతమును ధర్మ ♦ పద్ధతియును
నిమ్మెయి నెఱుంగువార లి ♦ య్యిలను గలరె
ధన్యుఁ డయ్యెను నినుఁ గాంచి ♦ దశరథుండు
సత్యసంధుం డనెడు వార్త ♦ జగతి నెఱయ. ౩౫౫

క॥ సంతోషించితి వత్సా !, సంతత మీభక్తి యే పొ ♦ సఁగుఁగావుత మి
ట్లింతకు నాయిడినది సు, స్వాంతం బాలింగనప్రి ♦ చారమె సుమిత్రా. ౩౫౬

ఆ॥ అట్లు రాముఁ డనఁగ ♦ నవనిజ దీవింప, దాసకృతుల కింత ♦ దలఁచి పొగడ
నేల యనుచు వారి ♦ కెఱఁగె వాఁ డవ్వార, లాదరించి రతని ♦ ననఘమూర్తి !

క॥ మందిరశరణుఁడు త్రిజగ, న్మందిరుఁ డటు సురల మునుల ♦ మనుపఁగ మహిజా
తేందిరతో నయ్యటవీ, మందిరమున నుండె నాస ♦ మయమున మహితా !

ఆ॥ జాగరూకుఁ డైన ♦ శౌరిఁ గొల్వఁగ వత్తు, రెఱిఁగి యెల్లవారి ♦ దేమి యింత
కేనుఁ దగనె యంచు ♦ నేతెంచె హేమంత, మంతరంబుఁ గాంచి ♦ యచలతనయ

—♦ హేమంతర్తు వర్ణనము ♦—

సీ॥ వడకించెఁ బడతులఁ ♦ వలను బాసితి మని, యాహితాగ్నులు గాని ♦ యట్టివారిఁ
జుళుకించె ఝురుల భా ♦ సురములౌ జలముల, నల్లనల్లనఁ జేరి ♦ యాగడమునఁ
బలికించె నేమన్కి ♦ పట్టుగట్టులు హిమ, వంతము ల్గా వంచుఁ ♦ బట్టు పట్టి
నడికించెఁ దీర్థ ము ♦ న్న నెగించుకొని పోవు, మనుజుల నిల్లెత్తు ♦ మందు సేసి
యెంతయుం జాల మేను హే ♦ మంత మొక్కఁ
డైన ముజ్జగముల ముంతు ♦ మామతింతు
మిందు మావాఁడె జాబిల్లి ♦ యినుని తెల్విఁ
గాంచఁ డని వీఁచు నమ్మంచు ♦ గాలి వాలి, ౩౬౦

క॥ కుంపటి యీసంసారము, దింపితి మని మురియువారు ♦ దేబె లగుచు నా
తెం పెనయ లేనివారును, గుంపటి యొండొక్కఁ డెత్తు ♦ కొని రెల్లజనుల్. ౩౬౧

ఆ॥ ఒంటి కేమి పండు ♦ పంట లింటికిఁ జేర్చి, గంటిఁ బాప నేర్చు ♦ కల్పతరువు
కంటివిందు నేలఁ ♦ గావించు నిధి యింత, కంబె మేలి తఱి యొ ♦ కండు గలదె.

క॥ బంతులు చేమంతులు నిసు, మంతయు నెడ యీక పూవు ♦ లందిచ్చు నెఱిన్
గొంత కొలంత దొఱఁగె హే, మంతర్తువు కలవునందు ♦ మహిభృత్పుత్రీ.

శా॥ అక్కాలంబున గౌతమీనదికి స్నా ♦ నార్థంబు సీతామృగీ
దృక్కాంతుం డనుజుండు భావినియు న ♦ ర్థిం దోడ నేతేరఁ బ్రా
గ్దిక్కాదిత్యుఁడు నేరరాకమును దీ ♦ ధత్యోఘ మద్దేవు తా
దృక్కృత్యంబు సమర్థత న్నెఱపఁ బ్రీ ♦ తిం గూర్చుచుం బోవుచోన్. ౩౬౪

క॥ అన్నఁ గని తమ్ముఁ డిట్లను; నన్నా! నీమనమునకు స ♦ మాహ్లాదకమై
సన్నుత మగు సమయం బా, సన్నం బైనది ప్రశస్తి ♦ సంవలితముగన్. ౩౬౫

తే॥ దేని కలిమి వత్సర మెల్ల ♦ దీప్త మగునొ, క్ష్మాసతీమణి కెది యలం ♦ కార మిదునొ
యట్టి హేమంత మీయెడ ♦ నరుగుదెంచె, నీప్రసాదంబుఁ గాంచ నో ♦ నెఱి యెఱింగి.

సీ॥ మంచు గ్రమ్మెడు నన్న ♦ మాట యొక్కఁడె కాని, సస్యశాలిని యమ్యో ♦ క్ష్మావధూటి
జలము లత్యంతశీ ♦ తలములే యగుఁగాని, వరణీయుఁ డగు హవ్య ♦ వాహనుండు
చలియోట కింట భూ ♦ జను లుందు రనికాని, దండయాత్రఁ జరింత్రు ♦ ధరణిపతులు
సారసరసలబ్ధి ♦ సన్నంబె యాఁగాని, సంపూర్ణ మా గోర ♦ సపరిచార

మఱియు నేలోపమును లేని ♦ దని యొకండు
గలదె గుణవృద్ధి గని దానిఁ ♦ గప్పిపుత్తు
రెల్ల సంపదలకు నిది ♦ హేతుభూత
మాటఁ గాదె శ్రుతిప్రశం ♦ సార్హ మయ్యె. 3౧౮

తే॥ ఆగ్రయణము లొనర్చెద♦రాహితాగ్ను, లెల్ల దేవర్షి పితృపూజ♦లెలయుచుండు
జనపదములొప్పెడుఁ గలాప్ర♦చారములను, మంగళాశంస లెల్లెడ♦మలయునిపుడు,

తే॥ ఎండ పూర్వాహ్ణమున నింత ♦ యొఱుకపడదు
స్పర్శసుఖ మిడు నదె నడి ♦ జామువేళ
నరుణపాండుర మగుచు సా ♦ యాహ్నమునను
గనులపండువు ఘటియింపఁ ♦ గాఁ గడంగు. 3౧౯

తే॥ స్వకము సౌభాగ్య మారవి♦సంక్రమింప, మంచునసి యొఱ్ఱనగు తన♦మండలమునఁ
గందువాఱిన యద్దంబు♦కరణిఁ జంద్రుఁ, డందగింపఁడు తొల్లింటి♦యట్లధీశ !

తే॥ అల్లనల్లనఁ దొడరి హి♦మావృతంబు, లైన కరముల భూస్థలి♦నందలేక
పగటి చందురుఁ బోలెడు♦భానుఁ డిపుడు, తపనశబ్దార్థతత్త్వంబు♦దారి తలఁగ.

సీ॥ ఎదిరి దిక్కునఁ బ్రొద్దు♦పొదలంగ నుత్తర, దిశ బొట్టులేని స్త్రీ♦తెఱఁగు నూపె
నినుఁడు దూరగుఁడు గా♦నివ యెల్లెడలఁ గప్పు, హిమవత్పదార్థ మ♦గేంద్ర మెనసెఁ
బున్నమ రేయెండ ♦ పొనరార దాతప, శ్యామయా నాఁగేటి ♦ చాలు భాతి
నీహారముక్తార్క ♦ నిహితాంశువుల శాద్వ, లావని రత్నశో ♦ భాఢ్య మయ్యె
పగలు సన్నగిల్లెఁ ♦ బ్రబలె నట్టి త్రియామ
శయ్య లాలసంబు ♦ జాడఁ జూడ
వయ్యె నళినవనవ ♦ నాళులు రిక్తతఁ
గనె హిమాని నెగడు ♦ కాల మడర. 3౨౨

క॥ మున్నెండఁ గన్నెఱుంగని, కన్నెలు జల మంచు ముట్టఁ ♦ గాఁ జాయయటం
చెన్నఁగఁ దలఁపరు హిమవే, ళౌన్నత్యం బింత లనియు♦నన రా దనఘా! 323

ఉ॥ మంచను చీరె గప్పుకొని♦మా నగు పూవుల సొమ్ము లూడ్చి యా
సంచున నిద్రఁ గాంచు వన ♦ సంతతి నాశుకశారికాళి తె
మ్మంచన దంచునన్నిలిచి ♦ యట్టె కనుంగొనుఁ గాని నీట ము
క్కుంచదు నీరపక్షితతి♦యుల్లము ఝుల్లన రొంప ముంపఁగన్. 3౨౪

క॥ చల్లనిది తీయనిది ముద, ముల్లసిలఁగఁ జేయునదియు ♦ నుదకము గని తా
నల్లనఁ గర మిడి వెంబడిఁ కల్లోలపడుం దృషితము ♦ కలభము కంటే. ౩౭౫

తే॥ చకితు లాహవమున నట్లు ♦ జలమున నవ
గాహనం బొనరింప వీ ♦ కవివితతులు
లోఁగి యొడ్డునఁ గూయు వా ♦ లుకల దడిపి
మంచుపొగ తమ్ముఁ గ్రమ్మి పై ♦ మాయఁ జేయ. ౩౭౬

ఆ॥ మేలి మంచు పడుట♦మృదువు భాస్కరుఁ డాట, జలము రస్య మై పొ♦సంగుఁ గాని
సరసు లొఱవు గనవు ♦ క్షతదళకర్ణికా, కేసరాబ్జవనవి ♦ గీతికతన. ౩౭౭

—♦ లక్ష్మణుఁడు భరతు గుణముల నన్నతోఁ జెప్పుచు దుఃఖించుట ♦—

సీ॥ అన్న కోసలనాధుఁ♦డానరసింహుండు, భరతుఁ డెమ్మెయిఁ గష్ట♦పడెడునొక్కొ
నీమీఁది భక్తిచే ♦ నెఱి బాసి వ్రతనిష్ఠ, సలుపుచు నున్నాడు ♦ సంతతముగఁ
గలిమిభోగము లంచుఁ♦ గాంక్షింపఁ డేనాఁడుఁ, ద్వద్దాస్యపరతపైఁ♦ దవులుతమిని
నియమితాహారుఁడై ♦ నేల సెజ్జను జడ, లట్టిన తల వ్యధా ♦ కారణముగ
మేను వైచి పదంపడి ♦ మేలుకాంచి
సారవజలంబులం దిట్టి ♦ సమయమునను
స్నాతుఁడై కొందఱం గూడి ♦ జరుగునప్పు
డేమిగతిఁ గానఁబడు వాఁడొ ♦ యెఱుక పడదు, ౩౭౮

క॥ సుకుమారుఁడు సుందరుఁ డ, త్యకలంకుఁడు సత్యవాది ♦ యాహ్లాదకుఁడున్
సుకృతజ్ఞుఁడు కృతి నేఁ డే, వికలతమై నున్నవాఁడొ ♦ విధికృతివశతన్. ౩౭౯

ఆ॥ గెలిచినాడు దివముఁ ♦ గేలిమై నీభ్రాత, భరతుఁ డమ్మహాను ♦ భావుఁ డెపుడు
నిన్నె తలఁచి కొలిచి ♦ నెఱిఁ ద్వత్పదధ్యాన, నిరతిఁ దవిలి యిట్లు ♦ నెగడుకతన.

ఆ॥ తండ్రితోడివారి ♦ దాయాదు లని వీడ, నెంతు రమ్మవైపు ♦ నెలమి గొంతు
రెపుడు ద్విపదు లనెడు ♦ నీవార్త రిత్తగాఁ, జేసెఁ గైక సుతుఁడు ♦ శ్రీకరుండు.

తే॥ దశరథునిఁ జెట్టఁ బట్టి శు♦ద్ధతఁ బరఁగియు
భరతు సజ్జననందితుఁ ♦ బడయఁ గనియు
నట్లు క్రౌర్యంబు వహియించె ♦ నంబ కైక
కేయుల దోసమో పూర్వ ♦ కృతము ఫలమొ. ౩౮౨

—♦ శ్రీరాముఁడు లక్ష్మణునితోఁ గైకను నిందింపవలదని పలుకుట ♦—

క॥ అను నుడి సహింప కిట్లను, ననఘుఁడు శ్రీరామచంద్రుఁ ♦ డన్నా! నీ వ
ట్లనఁజనదు మధ్యమాంబిక, ననవద్యయ యామె తలఁప ♦ నన్నివిధములన్. ౩౮౩

క॥ భరతుని వార్తలె తెలుపుము, పరమాప్తుఁడు వాని కెడము ♦ పడి వననిష్ఠా
నిరతుండ నగు నామది త, ద్భరితప్రీతి నగుచుండు ♦ బాలిశ మనగన్. ౩౮౪

తే॥ మానసాహ్లాదకరములు♦మధురములగు, నతనిపలుకులె స్మరియింతు♦నహరహంబు
నమృతమయములె యనుకొందు♦నంతరంబు, దోఁపకుండుఁట మదిని ని♦ర్ధూతవైరి?

క॥ ఎన్నఁటికిఁ గాంచ నగునో, యన్నా! భరతునిఁ ద్వదీయు ♦ ననుజన్మని నీ
వు న్నేనును వారును ము, న్నున్నట్టులె యుండి యరుస ♦ మొలయం గలమో.

క॥ అని యుత్సుకతం బెరయుచు, ననుజుఁడుఁ దా మహిజయును మ♦హాగౌతమిఁ దోఁ
గి నియతి దైవతతృప్తిం, బొనరించి నుతించి రినుని ♦ బూర్ణేందుముఖీ! ౩౮౭

తే॥ అమ్మెయిఁ గృతాభిషేకుఁడై♦యనుజుతోడ, సీతతో రాముఁడొకవింత♦సిరిఁదనర్చె
నీవు విష్ణుండు తోడుగా♦నియతి నొకట. స్నానమొనరించి నే మించు♦చందమునను.

ఉ॥ ఆహ్నికకృత్యము ల్నెఱపి ♦ స్వాశ్రమభూమికిఁ జేరి తీర్ణమా
ర్థ్యాహ్నికులై మును ల్గొలువ ♦ నా సభ సత్కథలం దనర్చి సా
యాహ్నికముం బొనర్చి సుఖ ♦ మందిరి నిచ్చలు నట్లె యుందురే
నిహ్నవపుం గృతిం గనని ♦ నేమము ముజ్జగము ల్నుతింపఁగన్. ౩౮౯

తే॥ సీతతో రాముఁ డొకనాఁడు ♦ చెలువు మీఱఁ
జిత్రతోఁ జందురుని యట్లు ♦ చెలఁగుచుండ
నంజలి ఘటించి శుశ్రూష ♦ కలరు కలన
లరసి లక్ష్మణుఁ డిట్లనె ♦ నలరుఁబోఁడి. ౩౯౦

—♦ లక్ష్మణుఁడు తత్త్వోపదేశంబు సేయుమని శ్రీరాముఁ బ్రార్థించుట ♦—

క॥ ఏ నజ్ఞానము దలఁగఁగ, నీనెనరున మోక్షమార్గ ♦ నిర్ణయ మరయం
గా నెంచితిఁ గావవె యది, పూని యెఱింగించి నన్నుఁ ♦ బురుషోత్తంసా! ౩౯౧

తే॥ తనకు నీకన్న దేశికో ♦ త్తము లొకొండ్లు, లేరు లీలావిభూత్యవ ♦ లీఢమూర్తి
వచ్యుతుఁడ వట్లు గావున♦నవధరించి, న న్నొనర్పవె ధన్యు మ♦న్నాథ! నేఁడు.

తే॥ రాగవిద్వేషహరము వై ♦ రాగ్యకరము, జ్ఞానవిజ్ఞానభక్తివి ♦ స్తారకంబు
నైన తత్త్వంబు బోధింపు♦మయ్య! దాన, నిన్నుఁ గొలిచి భవాంభోధి♦ని స్తరింతు.

క॥ అనిన యనుజన్ము పలుకుల, కనుమోదితుఁ డగుచు వాని ♦ యాత్యంతికభ
క్తినిఁ గనుఁగొని మెచ్చుచు ని, ట్లని రాముఁడు తెలుపఁ దొడఁగె ♦ నజముఖ్యనుతా!

—♦ శ్రీరాముఁడు లక్ష్మణునకుఁ దత్త్వోపదేశం బొనర్చుట ♦—

తే॥ అతిరహస్యంబు నిష్కృష్ట ♦ మైన తత్త్వ, మే నెఱింగింతు వత్స! నీ ♦ కెఱుకపడఁగ
గాంచు నిద్దాని నరసియా ♦ క్షణమె ముక్తి, బొదలు వైకల్పికభ్రాంతి ♦ వదలినరుఁడు

సీ॥ పరఁగ మాయాస్వరూ ♦ పము మున్ను వివరింతు, సమనంతరము జ్ఞాన ♦ సాధనంబు
విజ్ఞానయుతము సం ♦ విద్యోగ మాదటఁ, బరమాత్మతత్త్వాను ♦ భవముఁ బిదప
నలరు నద్ది వొసంగ ♦ నభయప్రతిష్ఠుండ, వయ్యెద వయ్య నీ ♦ వనఘమూర్తి
వాత్మబుద్ధి యనాత్మ ♦ మైన శరీరాది, యందుఁ దోచుట మాయ ♦ యనఁదనర్చు
వఱలు దాన సంసృతి పరి ♦ వర్తనంబు
తాన విక్షేపరూపంబు ♦ దవిలి జగము
లెల్లఁ జేయు నావరణాత్మ ♦ నెనసి జ్ఞాన
మావరించును దన్మూల ♦ మరయు టరిది. ౩౯౬

తే॥ అనఘ! కేవలుఁ డగు పర ♦ మాత్ము నందు
మాయచేఁ గల్పితంబయి ♦ మలయు జగము
రజ్జువున సర్ప మట్టిదై ♦ భ్రాంతి కలిమిఁ
దోఁచుచుండు వివేచింపఁ ♦ దొలఁగుచుండు. ౩౯౭

క॥ వినునది కనునది స్మరియిం, చునదియు నన మున్నుగాఁగఁ ♦ జొప్పడునది యె
ల్లను నన దన నగు స్వప్నం, బునఁ బొనరు మనోరథంబు ♦ పోల్కిఁ గృతాత్మా!

తే॥ తనువె సంసారతరుబీజ ♦ మని దృఢముగఁ, దలఁపు మది దారపుత్రాది ♦ కలల కెల్ల
మూల మగుఁ గాదె యద్దాన ♦ మొనయుజీవ, భావబంధభేదము లాత్మ ♦ పక్షమ నకు.

తే॥ భూతతన్మాత్రపంచకం ♦ బులు నహంత
బుద్ధి మన మక్షదశకంబు ♦ మూలభూత
ప్రకృతి యాభాసుఁడును జేరఁ ♦ బరఁగు క్షేత్ర
మింతకు విలక్షణుఁడె యాత్మ ♦ యిద్ధచరిత! ౪౦౦

క॥ తా జీవుఁ బ్రబోధించుట, కేఁ జెప్పెద సాధనముల ♦ నిడు మిది యెదలో
ధీజవ్య భిదమె క్రమముగ, నాజీవపరాత్మభేద ♦ మయ్యెఁ గుమారా! ౪౦౧

వ॥ మానాభావంబును దంభహింసాదిపరివర్జనంబును బరాక్షేపాదిసహనంబును నవక్ర
భావంబును ద్రిశుద్ధిపూర్వకంబుగ గురుపరిసేవనం బొనరించుటయు బాహ్య

భ్యంతర సంశుద్ధియు సత్క్రియాస్థైర్యంబును మనోవాక్కాయదండంబును విషయ
నిరీహత్వంబును నిరహంకారత్వంబును జన్మజరాద్యాలోచనయు నసక్తియు సుత
దారధనాదులయెడ స్నేహశూన్యతయు నిష్టానిష్టాదుల దెస సమభావంబును
సర్వాత్మకుడనైన నాయందు ననన్యవిషయం బగు మతివిశేషంబును వివిక్తదేశనిషే
వణంబును ప్రాకృతజనసంవాసవైముఖ్యంబును స్వాత్మజ్ఞాన ప్రయత్నంబును
వేదాంతార్థావలోకనంబును నను నీసద్గుణంబు లలవడునేని విధ్వస్తతమస్సముద
యం బగు జ్ఞానోదయంబు సముదంచితంబుగా సంఘటిల్లు: ౧౦౨

సీ॥ దేహేంద్రియప్రాణ ♦ ధీమనోహంకృతి, లక్షణాకృతికి వి ♦ లక్షణుండ
సురుచిరచిన్మాత్ర ♦ శుద్ధబుద్ధాత్ముఁడ, నే నంచు నిశ్చయం ♦ బెనయు దేని
చే నది జ్ఞానంబు ♦ చిత్ప్రకాశక మేక, మద్వితీయ మఖండ ♦ మక్షరంబు
పరిణామధీగుణో♦పాధిసంగవిముక్త, మానందపూర్ణమ♦వ్యయము నిత్య

మైన పరమాత్మతత్త్వంబు ♦ నందు సామ
రస్యయోగంబు యత్ప్రచా ♦ రమునఁ దనరు
నట్టి జ్ఞానంబె విజ్ఞాన ♦ మది గురూక్తి
శాస్త్రసిద్ధంబు నాఁ జను ♦ జనవరేణ్య ! ౧౦౩

తే॥ అట్టి జీవపరాత్మల ♦ కైక్య మెప్డు, సద్గురుప్రోక్తలక్ష్యాప్తి ♦ సముదిత మగు
నప్పుడె యవిద్య కరణకా♦ర్యములతోడ, నంతరించును పరమాత్ము♦నంతరమున.

ఆ॥ ఆయవస్థ ముక్తి ♦ యన నొప్పు నద్దియు, నౌపచారికమె ప ♦ రాత్మునందు
వెలయు మింక జ్ఞాన ♦ విజ్ఞానవైరాగ్య, సహిత యిట్టి యమృత ♦ సరసిఁ బెరసి.

క॥ ఇది దుర్లభ మని యెంచెద, నదనున మద్భక్తివిముఖు ♦ లగువారికి నే
యది పగలు సులభ మగు న, ప్పదమే నిశఁ గంటఁ బడయఁ♦బాల్పడని గతిన్.

తే॥ కాన మద్భక్తిపరుల కే♦జ్ఞాన మొదవు, జ్ఞానము లభింప బ్రహ్మసా♦క్షాత్కృతి యగుఁ
దనరు నెన్నియొ భక్తిసా♦ధనము లగుచు, నందుఁ గొన్నింటి వినిచెద♦ననఘ! వినుము.

సీ॥ మద్భక్తసంగతి ♦ మత్సేవనాసక్తి, మత్కథాశ్రవణసం ♦ పత్ప్రసక్తి
పఠనతద్వ్యాఖ్యాన ♦ పరత మదర్చనా, పరినిష్ఠకీర్తన ♦ భజననిరతి
మన్నామపదబీజ ♦ మంత్రజపాత్యంత, సంసక్తి సజ్జన ♦ సాధురక్తి
యేకాదశీముఖా ♦ భీష్టదాయివ్రతా, చారానుమోదప్ర ♦ చారయుక్తి

సంతతము గల్గి వర్తించు ♦ సాధకునకు
భక్తి యవ్యభిచారిణి ♦ పరఁగు నిచ్చు
లది యొకఁడె ముక్తి నందఁజే ♦ యంగఁ జాలు
జ్ఞానవిజ్ఞానవైరాగ్య ♦ సంశ్రియమున. ౪౦౯

క॥ నీయడిగిన యర్థము ముని, గేయము నే వినిచినాడఁ ♦ గీలించి మదిన్
శ్రీయుతుఁడై యస్మోయి ని, శ్రేయసమును బెరయు నరుఁడు ♦ చిరసంసిద్ధిన్.

ఆ॥ ఇంద్రరాజ్య మొసఁగె♦నేనియు నీయకు, మెవఁడు భక్తియోగ ♦ మొనయఁ డతని
కాదరించి పిలిచి ♦ యవ్వాని కిడు మిది, భక్తియుక్తి నొందు ♦ పరఁగునేని. ౪౧౦

క॥ మనసంవాదం బెవ్వం, డనితరసులభ మని తలఁచు ♦ నామ్నానించున్
ఘనుఁడై సుశ్లోకుండై, యనన్యుఁడయి వాఁడు ముక్తి ♦ నందు సుధీంద్రా! ౪౧౧

శా॥ భక్తు ల్యోగపరు ల్వినిర్మలతర ♦ స్వాంతుల్ప్రశాంతు ల్సునం
సక్తాధ్యాత్మవిచారు లౌపనిషద ♦ శ్రిద్ధానుబద్ధాత్ము లు
ద్రిక్తాఽజ్ఞానతమోనిహంత్మమదుపా ♦ ధిధ్యానసంభావనో
ద్యుక్తు ల్సమ్మతయుక్తులు స్వపదసా ♦ యుజ్యార్థులర్హోదయా! ౪౧౨

—♦ లక్ష్మణుండును సీతయు రాముని తత్త్వోపదేశంబున కానందించుట ♦—

తే॥ అని ప్రబోధింప లక్ష్మణుఁ♦డంతరంగ, మంతయును సంతసమ కాఁగ♦సంతమసము
దెరలసేవించె రాము వై♦దేహి వాగదె, భక్తచింతామణీ! గుణా♦భరణ! యనుచు.

తే॥ సంతతసుఖానుభూతిని ♦ సాంద్రు లగుచు
మునులు ననుజుఁడు మహిజయు ♦ మొనసి కొలువ
రాముఁ డటు సర్వసుజనాభి ♦ రాముఁ డగుచుఁ
గడపెఁ గొండొక కాలంబుఁ ♦ గమలనయన! ౪౧౪

క॥ నిత్యానందమయుం డటు, లత్యాహితములు దొలంప ♦ నై మునులకునై
సత్యసుజన్ములతో స్వా, నుత్యముతో నిలిచె నచట ♦ మహిభృత్తనుజా! ౪౧౫

క॥ అని శివుఁ డెఱిఁగించిన శివ, విని చేతోవృత్తిఁ దద్వి ♦ వేచనపరత
న్నొనయించి కొంత తడవున, కనంతరస్థితి వచింపు ♦ మని యడుగుటయున్.

ఉ॥ అక్షరతత్త్వమూర్తి విది ♦ తాక్షరగుంభనివేదితాత్మ ప్ర
త్యక్షసుఖానుభావమయ ♦ హానిసమృద్ధివికారదూర స
ద్వీక్షణసంహితాఖిలని ♦ వేశమహాశయలక్ష్య సర్వసం
రక్షణదీక్షితా సుజన ♦ రామమనోరమశాశ్వతత్పరా! ౪౧౬

క॥ ఈశ! బిలేశయసముదా, యేశనివేశితమహామ ♦ హీధరభారా
వేశా తద్భృతిహృతికృత, వేశ మహేశా! యనీశ! ♦ విశ్వాధీశా! ౪౧౮

మంజు॥ నవమోహనాకృతిస ♦ నాథ! చిన్మయా!
ప్రవరాత్మయోగ ♦ పటుభావనాంచితా!
వివృతస్వతత్త్వసుని ♦ విష్టసత్త్వభృ
త్కువికల్పనాఖిల వి ♦ కల్పనోచితా! ౪౧౯

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునం
దరణ్యకాండంబునం బ్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ శివాయగురవే నమః

# శ్రీరామకథామృతము

## అరణ్యకాండము.

———o———

### ద్వితీయాశ్వాసము.

———o———



యామినీంద్రభాస్వ
చ్ఛాయోత్సాదితతమఃప్ర ♦ సారణత్రిజగ
న్మాయాకలనా సాక్షి
త్వాయత్తగుణప్రచార ♦ ణా! మునిశరణా! ౧

వ॥ అవధరింపు మట్లు వేఁడిన మహాదేవీదేవి కమ్మహాదేవదేవుం డిట్లనియె. ౨

తే॥ వింటె యిందీవరాక్షి! శ్రీ ♦ విభుని చరిత
మూర్ధ్వమూల మథశ్శాఖ ♦ మూర్జిత మనఁ
దనరు చెఱ కిది రస మమృ ♦ తాయితంబ
కాదె కడముట్టఁ గోనఁ గాంచు ♦ కవివరులకు. 3

—♦ శూర్పణఖాఽగమనము ♦—

తే॥ ఆజనస్థానమున నుండి♦యడవిఁ దిరుగు, త్రిమ్మరి యొకర్తు రాకాసి♦తెరువుమిత్తి
తబిసిపిండున కయ్యాది♦దరలి యొక్క, నాఁడు గోదావరీమహా♦నది తటమున. ౪

క॥ దారితలం గాంచెఁ దమో, దారి తరుణచరణనళిన ♦ తత్తద్రేఖా
హారిసుపదముల శంబర, వైరియుఁ దోడ్తోనె యవ్వి ♦ వల్గిత నొంచెన్. ౫

ఆ॥ విస్మయాబ్ధిఁ దోఁగి ♦ విపరీత కామప, రీతచిత్తయగుచు ♦ నీతి లేని
రీతి సహజ తనకు ♦ దూతి యై తసర ని, ట్లని తలంచెఁ దలఁపు ♦ లబ్జముఖిరో. ౬

ఆ॥ కూటశంబరారి ♦ కోటి యిప్పదకలా, కోటి నొకఁటఁ బోల్పఁ ♦ గూర్చె నేనిఁ
జాలదే తదీయ ♦ సౌందర్య విభవంబు, జగము లెల్ల నేలఁ ♦ జాలుటకును. ౭

క॥ నెయ్యం బెట్టిదొ యియ్యెల, కియ్యెడుగులు దాల్చి మరియు ♦ నీతని యెడనే
నయ్యాకృతిఁగని యెమ్మెయి, నయ్యెదనో దయ్య మెఱుఁగు♦నయ్యలఁతికృతిన్. ౮

ఆ॥ ఎంతవాఁడొ తలఁపు ♦ లెంతలో యమ్మెయి, నింతకాని సొబఁగు ♦ వెలకుఁ గొన్న
యింతి యేమివలని♦యిల్లాలొ యెల్లైనఁ, గంతుగుటి యెకమ్మ♦గతియుఁగను నె. ౯

ఆ॥ శాంబరీ ప్రభావ ♦ సంసృష్టి నెట్టులైన, వాని ముంచి తేల్చు ♦ వలనుగాంచి
కూడిమాడియవలఁ♦గొన నెంతుఁదాత యి, త్తనువొనర్చి యిడిన♦తత్ఫలంబు. ౧౦

క॥ అని మొనకొని కొండొకవిధ, మున రూపొనరించి యసుఁగ ♦ మొనసిన చాయం
జని కనెఁ బర్ణనికేతన, మనంతరము గాంచె మోహ ♦ నాకారు మదిన్. ౧౧

సీ॥ శ్యామలాభ్రము వెంట♦జంట బాయకమించు, మించుఁదీవియ జాడ♦మెలపుతోడఁ
గామకోటిప్రతీ ♦ కాశప్రకాశమ్ము, మాకోటి దను చంద ♦ మామతోడఁ
గమ్మని నగు సోయ ♦ గమ్మని సిరి యాడు కమలపాలికపాలి ♦ కలిమితోడ
సమయోచితోద్యద్ర ♦ సమయోపహారమ్ము, లందిచ్చు స్మారశ ♦ రాళితోడఁ

గంబు లెత్తి పెంచి ♦ కమనీయ మంకమ్ము, గప్పిపుచ్చి యిడ ని ♦ కటకవాట
సీమ వెలయుపేర్ల♦చెలువమ్ము గలవింత, పురుషుఁగాంచె శోత్ర♦చరవధూటి. ౧౨

—♦ శూర్పణఖ రామునిఁ జూచి తలపోతలకుఁ జొచ్చుట ♦—

క॥ ఆసుస్వర మాస్వరసత, యాసామ్రాజ్యంబుకలిమి♦ నందినసిరి తా
నా సన్నాహము బీరం, బాసురి గని కామపరవ ♦ శాత్మిక యగుచున్. ౧౩

ఆ॥ స్మరునిఁ గెలిచి యతని ♦ సర్వస్వము హరించి, విశ్వమోహకలన ♦ వెలసి నట్టి
రుద్రుఁ డనినఁ గాక ♦ రూఢిమై వలఁదఁగా, భసిత మేల జటల ♦ పటలమేల ౧౪

ఆ॥ మొనసినాఁడు వీఁడు ♦ మునివేసమున నిట్లు, పడఁతి తోఁడుగాఁ ద ♦ పస్య నెఱపి
వైరి వైర మీఁగ♦వలను గాంచుచు నున్న, శంబరారియే య♦సంశయముగ. ౧౫

క॥ కన్నులు దమ్ములు నడు మని, యెన్నఁగఁ బిడికిఁటికిఁ జాల ♦ దెంతపొడవు లీ,
తిన్నని భుజములు నెమ్మొగ, మున్నది జగమెల్ల మొక్క♦దో తన కనుచున్ ౧౬

క॥ మగసరి నెనసిన తనసిరి, మగలనె యులికించు ననెడు ♦ మాట కితనికిన్,
మగువ లన నెంత సేయుదు, రగపడి రని మానధనము ♦ లరయక గొనఁడే. ౧౭

ఆ॥ ఊర కున్న నింక ♦ నోటమి వెట్టఁడే, దుండగీఁడు మరుఁడు ♦ తొలఁచి తొలఁచి
పలుకరించి యువలఁ♦బ్రౌఢను నెఱపంగ, వలయు పనికిఁ దూఁగ♦వలయుఁగాక. ౧౮

సీ॥ అని యిట్లు తలపోసి ♦ కొని యవ్విభావరీ, చారిణి కోరె హా ♦ స్యంబు నాక
రాము నిందీవర ♦ శ్యాము విశాలాక్షు, మారసుందరు సుకు ♦ మారు సుముఖు
వృత్తమధ్యు సుకేశుఁ♦బ్రియరూపు సుస్వరుఁ, దరుణు దక్షిణు న్యాయ♦తత్పరుఘను
రుష్ట వివర్ణ వి ♦ రూపాక్షి రాకాసి, కర్కశ దుర్ముఖి ♦ గండశైల.
మధ్య తామ్రకేశి ♦ మారి భైరవనాద, వృద్ధ వక్ర దుష్ట♦ వృత్త నీచ
చేరిపలికెఁ దనదు♦చెడుగు వేసముదాఁచి, చెలువ మెలమి కొంత♦ వెలయుచుండ. ౧౯

—♦ శూర్పణఖ రాముని వృత్తాంత మడుగుట ♦—

ఉ॥ నారలు గట్టి పెంజెడలు♦నా కివి యెట్టివి నాక దాల్చి తో
నారియు రాఁ గుమారదశ ♦ నాఁడె యనాకరనిష్ఠఁ బూని కాం
తారము రాక్షసాకరము ♦ దద్దయుఁ జొచ్చి వసించి తింతలా
నేరము లేమి వచ్చిపడె ♦ ని న్నొరు లొప్పుటకు న్మనఃప్రియా! ౨౦

ఉ॥ మెత్తని మేను సోయగము ♦ మేరకు మీఱిన దన్నమాటకున్
గ్రొత్తది ప్రాయ మిత్తఱిని ♦ గోర్కులు దీవెలు బాఱ నెట్టనన్
మిత్తికి గడ్డ వెట్టి రతి ♦ మించి సుఖించు నెఱిం దొఱంగు నీ
వృత్తము దెల్పుకున్న మది ♦ వెంగలి యై దెస లాఁగఁ దూఁగెడున్. ౨౧

తే॥ ఆకు లలములు మెసవి నీ♦ రాకరములఁ, దోఁగి కటకారు సెజ్జలఁ ♦దూలి వ్రాలి,
ఇన్నికడగండ్లు పడఁ గొన్న♦యీవ్రతమున, మేలి శరచాపములు లిఁ కేల♦మెలఁత యేల.

ఆ॥ ఎవనివాఁడవో కొ ♦ యెట్టిదో వ్యపదేశ, మేమి పనికి నిట్టు ♦ లెనయ రాని,
యాశ్రమంబు సొరఁగ♦నైతొ యెఱిఁగింపు, మేను విని యొకింత♦యెలమిఁగాంతు ౨౩

క॥ అన్న ద్దవ్వుఁ బలుకులే, యెన్నఁడు రామన్న యెఱుఁగఁ ♦ డిపు డఁట దీక్షం
బన్ని సతి కెలన నుండియు, నున్నది యున్నట్టు లనియె♦ నుర్వీధ్రసుతా! ౨౪

—♦ రాముఁడు శూర్పణఖతోఁ దనవృత్తాంతము సెప్పుట ♦—

క॥ ఏము దశరథుని తనయుల, మామహిపతి యనుప నడవి ♦ కరు దెంచితి మిం
దేమొయి నేనియు ధర్మువు, నేమంబున నెఱయఁ జేయు♦ నెటె మా కబలా! ౨౫

ఆ॥ ఈపె సీత యాదు♦ రిల్లాలు తనకు ల, క్ష్మణుఁ డతండు ప్రథిత ♦ గుణుఁ డనుజుఁడు
నన్ను రాముఁ డండ్రు ♦ నళినాక్షి దీక్షమై, నుంటి మిట్లు పితృని♦ యుక్తిఁ జేసి. ౨౬

క॥ నీ వెవ్వరిదానవో యిం, దే వెరవున నేమిపనికి ♦ నే తెంచితివో
నే వినవలతుం దైవత, భావము వాగ్రూపములఁ బ్ర ♦ పంచిత మగుటన్. ౨౭

—♦ శూర్పణఖ తనవృత్తాంతము సెప్పి రామునితోఁ దన్నుఁ జేకొను మనుట ♦—

ఆ॥ ఇచ్చ వచ్చె నేని ♦ నెఱిఁగింపు మనవుడు, నదియుఁ బలికె మదను♦ ప్రదరములకు
నులికిపడుచుఁ బడుచు♦హాయలున కెనయంగఁ, జేసినట్టితనదు♦ చిన్నెలాలయ.

ఉ॥ రావణకుంభకర్ణులు ప ♦ రాకృతశత్రులు తత్పరాక్రమం
బీవును వింటివే మొ సుజ ♦ నేద్యుఁడు ధర్మి విపీషణుం డెటుం
బోవఁడు పాపకృత్యముల ♦ పోకడ ముప్వురు విశ్రవస్సుతుల్
నే విను వారి సోదరిఁ గ ♦ నీయసి శూర్పణఖాహ్వయశ్రుతన్. ౨౯

క॥ ఆసురసంతతివారల, మాసురపతి కేని వెఱవ ♦ మాకూఁకలా
భాసురమాయాశక్తుల, భూసురభ సుదాకృతులను ♦ బొలిచెద మనఘా. ౩౦

తే॥ తల్లివైపున సోదరు ♦ ల్దమకు ఖరుఁడు, దూషణుండుఁ ద్రిశీర్షుఁడు ♦ ధుతసపత్ను
లలఁతిఁబోని బలమ్ము లి ♦ మ్మరసి కొలువ, నుందు మేము జనస్థాన♦ మం దధీశ;

ఆ॥ ఒంటి మెలఁగుచుందు ♦ నుజ్జ్వలభోగేచ్ఛ, నీదు విభ్రమమ్ము ♦ నెఱియుఁ గాంచి
నదియు మొదలుగాఁగ♦మదనుని ప్రదరమ్ము, లంటఁ గాఁగి యొడఁద♦నదరఁ జేయు.

క॥ అద నరసి యెల్లనారల, వగలితి నావలచు బుద్ధి ♦ వశమున నెమ్మేఁ
బొదలించెదో పురుషోత్తము, మదనాకృతిఁ గొంటి నిన్న ♦ మానుషమూర్తీ.

తే॥ అబల మానుషి యీసీత ♦ యంతలంత, లగుసుగా కెట్లు సుశోడి ♦ యతనులీల
లోలసి మెప్పింపఁ జాలెదు♦నులవరమ్ము, ప్రాతమెఱుఁ గిడ్డ నిలుచునే♦పొల్లువోక.

ఆ॥ అననురూప యీపె♦నటుండు మీతమ్ముఁ, డోలు మీవు నేనుఁ♦బొరసి సుఖము
లనుభవించువార ♦ మట్టు గాకున్న ని, య్యిరువురను గ్రసింతు ♦ నింతలోన. ౩౫

క॥ సురుచిరతరువనఝరని, ర్ఝరిణీసుమవల్లరీల ♦ సత్కుంజతటీ
గిరికందరాంతరముల వి, హరింపుదము కరికరేణు ♦ కాంచితకలనన్. ౩౬

ఆ॥ నిన్ను వీడ నేర ♦ కిన్నెఱి వేఁడితి, నెమ్మెమెయిన పోవ ♦ నిమ్మటన్న
దానితపులుమదముఁ♦దానిదానించివి, స్మయముస్మయముఁదోఁప♦ సవితృకులుఁడు.

ఆ॥ సీత మోము గాంచి♦స్మేరాస్యుఁడై పరి, హాసమునకుఁ దొడరి ♦ యనియె నిట్టు
లాసపడకు మితని ♦ కోసుందరీ! వ్రత, నిరతు నెన్నికొనఁగ ♦ నీకుఁ దగునె. ౩౮

క॥ నాకోలఁది కిదియ చాలును ♦ నీకోలఁదియు నీవ యరయ ♦ నేర్తు వదియుఁ గా
కేకాలము నను వీడఁగ ♦ నీకామిని తలఁపఁబోవ ♦ దిచ్చ మెలఁగుచున్. ౩౯

ఆ॥ దీని పొత్తు దొఱఁగి ♦ తెఱవ నెమ్మనితో, నేఁ జరించుటరిది ♦ నియత మింత
వట్టు నిన్నుఁబోటి ♦ వనిత సాపత్యంబు, కలి భరించు టంత ♦ కన్న భరము. ౪౦

ఉ॥ ఒంటిగ నున్నవాఁడు సుగు ♦ ణోజ్జ్వలమూర్తి గుణాధికుండు ని
న్నంటి మెలంపనేర్చు జగ ♦ మంతయు మోవఁగలాఁ డొకంట నే
గంటియు లేదు నీ వరిగి ♦ కైకొను మాతని మత్సమోత్థ ము
క్కంటి శరాసన మ్మగము ♦ గ్రిమ్మెడు భానువిభం గ్రమించుచున్. ౪౧

క॥ భార్యార్థి వీర్యవంతుం ♦ డార్యుఁడు తరుణుండు వాని ♦ నర్థించిన నీ
కార్యముఁ గొనుఁ బొ మ్మనఁగ న ♦ నార్య యచటి కరిగెనట్టు ♦ లాలె మ్మనుచున్.

—♦ శూర్పణఖ లక్ష్మణునిఁ జేరి పలుకుట ♦—

ఉ॥ ఆతనిఁ గాంచి నీనెఱికి ♦ నా ననఁగా నగు భార్య నన్ను నీ
వీతఱిఁ గొమ్ము మే లరయు ♦ మిట్లు వచించెను నీదు భ్రాత ల
ఖ్యాతతవన్యభూముల మ ♦ హామ్ములు సేకొను మన్న దాని య
ప్పోఁతర మెల్లఁ దా నరసి ♦ పూజ్యుఁడు సస్మితుఁడై తనర్చుచున్. ౪౩

ఆ॥ పలికె నమ్మహాను ♦ భావుండు సౌమిత్రి, యితఁడు రామదాసుఁ ♦ డింతి ! వీని
నెనసి దాసి వౌదె ♦ యేల యింతటిదాని, కిట్టికాని యోగ ♦ మెక్కె మదికి, ౪౪

క॥ సిద్ధార్థ వీ వతండు స ♦ మృద్ధార్థుఁడు, నీకలాస ♦ మృద్ధికిఁ దగువాఁ
డద్ధార్మికు వరియింపుము ♦ పద్ధతి, రెండవ యువతిగఁ ♦ బరఁగించు నినున్. ౪౫

ఆ॥ నిన్నుఁ జూచి నీదు ♦ నెఱిఁగాంచి మానుషి, ససతి నాకరాళ ♦ నావిరూప
నాబృహత్ప్రచండ ♦ నావృద్ధ భార్యఁగా, ననుమతించునే సు ♦ ఖాప్తిఁ గనఁడె. ౪౬

క॥ పొ మ్మనవుడు నమ్మాటలు ♦ నమ్మి యదియ నెమ్మి యనుచు ♦ నగుబాటగు నా
కమ్మాయావిని చనె నా ♦ కమ్మవిలుతు చేతి కందు ♦ క మ్మగు మతితోన్ ౪౭

తే॥ చేరియాతండు నీపేరఁ ♦ జీటి వ్రాసెఁ జులుకసేయక నామేలు ♦ జూడు మనినఁ
జాలు పొమ్మని రాముండు ♦ జాలుకొలుప, రాగములుకగ మాఱఁగ ♦ రాళయగుచు.

—♦ శూర్పణఖ సీతను మ్రింగఁబోవుట ♦—

శా॥ ఏమీ వింతలు నీతలం బొడమెఁ గా ♦ కిల్లా లొక ర్తున్న నే
రామం జేకొనరాదె మీకొలమున ♦ న్రాజు ల్బహుస్త్రీరతి
శ్రీ మానింపరె చెల్వ లేని యతడుం ♦ జెల్లాట లాడింప నా
బామె ల్వన్నెనె యిట్టి వెఱ్ఱి నడకే ♦ ప్రొద్దెల్లఁ బోకార్పఁగన్. ౪౯

తే॥ నీ పొరువు గాంచి మఱియు నీ ♦ నిర్ణతోదరిని హరించినఁగాని నా ♦ రీతిఁగానఁ
బో వనుచు ఘోరరూపమై ♦ భూతనూజ నఱిమి కబళింప నెట్టన ♦ నుఱుకుటయును

—♦ రామాజ్ఞచే లక్ష్మణుఁడు శూర్పణఖ ముక్కుఁజెవులుఁ గోయుట ♦—

శా॥ హుంకారమ్మున నాఁగి రాముఁ డగునే ♦ యున్మత్తఁ బేరేప సా
హంకారాత్మత సీత కీ డరయు నూ ♦ హం బేర్చెడుం దీని ము
ద్దింకం జూడకు మీపిశాచి నిపుడే ♦ హీనాకృతిం జేసి యే
వంకం బోవఁగ నైనఁ దోలు మన భా ♦ వజ్ఞుండు సౌమిత్రియుఁన్. ౫౧

తే॥ డాసి యద్దాని కర్ణము ♦ ల్నాసికయును, గోసి తరలించుటయు నది ♦ గోనసీమ
నల్లఁదడుపుచు నఱచుచు ♦ నల్లఖరుని, మోఁల వ్రాలె నశని నాఁగ ♦ ముదితవించె.

—♦ శూర్పణఖ ఖరాసురుఁజేరి విలపించుట ♦—

క॥ బోరనఁ బొక్కుచుఁ బొరలుచు, మీ రుండఁగ నాకు నిట్లు ♦ మెయికొనె నడరం
చారాటపడుచుఁ దిట్టుచు, నారక్కసి మిన్నుపగుల ♦ నార్చుచుఁ బెలుచన్. ౫౩

తే॥ చెవుల ముక్కుల రక్తంబు ♦ చీరనొత్తి, కొనుచుఁ గన్నీటిధారలు ♦ కొండఝరుల
ననుకరింపఁగ వికలమై ♦ వనట నొందు, దానిఁగాంచి సంభ్రాంతుఁడై ♦ దానవుండు.

చ॥ తఱి కయి వేఁచు మిత్తిపయి ♦ దాడికిఁ గ్రుమ్మరుమాడ్కి నెవ్వఁడ
క్కఱసెడ మీఁ దెఱుంగ కిటు ♦ గాసిలఁ జేసెను నిన్ను వానికి
న్నెఱి గలదే ధర న్నిలువ ♦ నీనుడి వెల్వడి నంతలోన మే
నఱవుడు గాఁగ నవ్వఱడు ♦ లామిషము న్గ్రసియించు సంచునన్. ౫౫

ఆ॥ కృష్ణసర్ప మేని ♦ కృష్ణుండు చేచేతఁ, బుణుకజొచ్చినాడు ♦ పొలఁతి! వాని
పొలితి దెలుపుమిపుడె ♦ పోకార్తు నంతకు, నంతలైనవిడువ ♦ నింత నిజము. ౫౬

తే॥ కాలపాశమ్ము చుట్టెఁ ద ♦ త్కంఠ మింత, సేసె వాఁడు విషాన్నమా ♦ సించినాడు
శమనుఁడో వహ్నియో పాక ♦ శాసనుండొ, యెవఁడొ వివరింపు డాఁపఁగా ♦ నేల యింక.

తే॥ ఏను బాణమ్ములనె వాని ♦ యించు ప్రాణ, నివహము హరించెదను నేఁడె ♦ నీటఁ గలిసి
నట్టి పాలెత్తి గ్రోలెడు ♦ నంచలట్టి వవియు నవనియు నానుఁ ద ♦ దస్రి మురల. ౫౮

క॥ ఎవ్వఁడు వానిం గావఁగ, నివ్వసుధను లేఁడునమ్ము ♦ మీ పూఱుటమై
నవ్వార్త యెఱింగింపుము, క్రొవ్వుట గొఱియకు దొసంగు ♦ గూరన కాదే. ౫౯

తే॥ అని పరాక్రిమ మెసఁగఁ బ ♦ రాక్రిమణము
నకుఁగడంగిన యన్నయ ♦ న్నయ మెఱింగి
వర్థమానేర్ష్య యది పల్కె ♦ వర్థమాన
కమ్మున రకమ్ము గ్రిమ్ము మొ ♦ గమ్ము నెఱయ. ౬౦

ఉ॥ మారునిఁ గెల్తు రాకృతిఁ గు ♦ మారులు శ్రీసుకుమారు లుద్భటుల్
చీరమృగాజినాంబరులు ♦ జృంభితపద్మదళాయతాక్షు లా
చారపరు ల్ఫలాశనులు ♦ సంయమివేషులు దాంతు లాస్థితు
ల్తా రఁట రామలక్ష్మణులు ♦ దాశరథుల్సురథు ల్గభీరతన్. ౧౧

చ॥ ఇరువురు నన్నదమ్ములు మ ♦ హేశ్వరలక్షణలక్షితు ల్గనన్
నరు లనరాదు దేవతలు ♦ నాఁ జన దొక్కడ వజ్రహస్తుఁడున్
వరుణుఁడు నిట్టు లై రనిన ♦ వాస్తవమే యగునేమొ యేల యి
ప్పరుసున నివ్వనంబుఁ జొరఁ ♦ బాటిరొ చొప్పలరార డెమ్మెయిన్. ౧౨

ఆ॥ వారి నడుమ నొక్క ♦ వనితఁ దిల్లోకమో, హినిఁ దటిల్లతాభ ♦ నిందువదనఁ
జూచి యదియు మదను ♦ సుందరిఁ గిందరి, జేయఁ జాలు ప్రతిభఁ ♦ జెలఁగుటయును

తే॥ దాని హరియించు కోర్కె ల ♦ క్ష్మినిదాన
మిదియపో యను చూడ్కి చూ ♦ లెనసి కనఁగ
జతన మొనరించి యీాయగ ♦ చాట్లు పడఁగ
నైతి నది కప్ప యెలుఁగు పా ♦ మని యరయమి. ౧౩

క॥ ఏమైనఁ గాని యింకిట నాముప్వర నటిమి యేని ♦ నడఁచియ యేనిన్
గామన దీటింగా మన మామెయిఁ దద్రక్త మాన ♦ నగు నే ర్వొలయన్. ౧౪

ఆ॥ ఇంత సేసి యిట్టు ♦ లే నయి మిన్నక, పోవ మీామగఁటిమి ♦ పొల్లుగాఁగ
నింక వీరె మనల ♦ ని ట్టట్టు దోలరే, సురలు మునులుఁ గనులఁ ♦ జూచుచుండ.

క॥ ఈదండకాఖ్యవనమున కీమండగపుం, దునేదు ♦ లే తేరఁగ సం
వాదింతుౕ లెక్క గొన రా, మోదమ్మున మనల నిచటి ♦ మును లిప్డుఖ రా! ౧౬

క॥ పూ లమ్మిన యూర నె మన, కేలా కట్టియలు విలువ ♦ నెందేఁ జనగాఁ
బాలుపడుము లేదా పరి, పాలింపుము మగతనంబుఁ ♦ బరిపంథిహాతిన్. ౧౭

ఆ॥ నాయవస్థఁ గనియు ♦ నడికి నీ వూరకే, యుందువేని నీక ♦ యొప్పఁజెప్ప
దాన నున్నమాట ♦ నేనె నాకయి యిప్డె, వ్రాసి యసుఱు లెడలఁ ♦ బుత్తు మాన.

—♦ శూర్పణఖ మొఱ విని ఖరుఁడు పతీక్ష్ణాదుల రామలక్ష్మణులపై బంచుట ♦—

మ॥ అనినం గ్రోధపరీతమానసుఁడు వాఁ ♦ డద్దాని నూరార్చి చ
య్యన న క్తంచరుల న్సుతీక్ష్ణముఖుల ♦ న్వ్యాస క్తసంరంభులన్
ఘనకోదండశరాసికుంతధరుల ♦ న్గ్రౌర్యకృథానద్ధులన్
బనిచె న్మర్త్యుల బిల్కు మార్పుఁ డని వా ♦ క్పారుష్య మొప్పారఁగన్. ౨౦

—♦ సుతీక్ష్ణాదులు పదునలువురు రామునితోఁ బోరి చచ్చుట ♦—

తే॥ నాథు ననుమతి నాపదు ♦ నలువు రసురు
లుగ్రరణరంగవిదులు త ♦ మ్మొరసి చుప్ప
నాతి చనుదేర నేతెంచి ♦ నాతిదూర
మునను నృపసూనులను గనుం ♦ గొనిరి గిరిజ ! ౨౧

ఆ॥ ఎగిచి యయ్యరణ్య ♦ మెల్ల నే నని యాక్రమించి మించువారి ♦ మేలి తేజ
మరసి దైత్యు లిభము♦ లడవిచి చ్చెడఁగని యడరఁ బోనియట్లు♦ లైరి గౌరి! ౨౨

క॥ ఆరక్కసి వెరవున రఘు, వీరుల తెఱఁగింత తెలిపి ♦ విడిదల యిదె యం
చారూఢి పఱుప నెఱిఁ గని, యారక్షోవరులు గవియ ♦ నరుదెంచుటయున్. ౨౩

ఆ॥ రాముఁ డరసి కొఱవి ♦ రాకాసి గొనివచ్చె భటులు తొడర సిద్ధ ♦ పడినవారు
నీవు సీత యున్న♦ నెలవుఁ గాపాడు మే నఱిమి వారిఁ ద్రుంచి♦ యరుగుదెంతు. ౨౪

వ॥ అని యిట్లు లనుజన్ము ననుమతునిం జేసి. ౨౫

క॥ సన్నద్ధుఁ డగుచుఁ దా నా, సన్నగతుల నెదిరె రామ ♦ చంద్రుఁడు వారా
సన్న గని తొడరి రాయుధ, సన్నాహముతోడ దేవ♦సంసద్వినుతా ! ౨౬

ఉ॥ వారలఁ గాంచి యిట్టు లనె♦ వారిజనేత్రుఁడు రాముఁ డెట్లు మీ
రూరక పోరు పోరున క ♦ నుద్ధతులేనిఁ జనుండు జీవితా
శారహితు ల్నిలంబడుఁడు ♦ చక్కఁగ నిక్కడ మున్న మానులన్
నేరము లేక ద్రుంచు పగ ♦ నేఁటికి నీఁగఁ దలంచి వచ్చితిన్. ౨౭

క॥ యోజింపుఁడు మదినన నా, రోజ న్నాకొలఁది యెఱుఁగ♦కూహ బెనఁగి తీ
వేజాలిపా లగుదు నిలు, మాజి క్షురకరుఁడు ఖరున ♦ కరి వైతి విఁకన్ ! ౨౮

ఆ॥ అనద యంచు నబల ♦ నవమానితం జేయు, పనియ కా దటంచుఁ♦ బరశుముద్గ
రాసి శూలకలన♦లలరార నెక్కటి, యనుచు రాముఁ దొడరి♦యడరుటయును.

ఉ॥ అందఱ కన్ని రూపు లయి ♦ యర్కకులీనుఁడు మౌర్వీటంకృతిన్
జెందిన వజ్రఘోషకృతి♦శ్రీఘనుఁ డాఘను నట్లు గ్రమ్మఁ జే
రొందినవారు దైత్యభటు ♦ లొక్కటఁ గుమ్మరి శూలసంహతిన్
మ్రిందితి పొ మ్మటంచు నతి ♦ మానవిమానన ల్లుల్లసిల్లఁగన్. ౩౦

ఆ॥ అన్ని శూలములకు ♦ నన్ని వాలమ్ములు, దొడిగి యేసి పొడిగఁ ♦ ద్రుంచి వడిగఁ
దొడరు పిడుగు లట్లు ♦ తూఁపులు నిగుడించె, వారి లెక్క నాజి ♦ వరసుతుండు.

చ॥ శరములు సొచ్చి వక్షమునఁ ♦ జయ్యన వ్రచ్చి ధరిత్రి గ్రొచ్చి దా
శరథినిఁ జేరవచ్చి నిము ♦ సంబునఁ దచ్ఛరధి న్నిల న్నెబా
సుర యని మెచ్చి రయ్యనిమి ♦ షు ల్వాడి రాహవభూమి నాసురుల్
సరగున ఛిన్నమూలములు ♦ సాలము లట్లు ధరేంద్రనందినీ ! ౫౩

ఆ॥ వారి పాటు గాంచి ♦ వల్లకాఁటి పిసాచి, మొనసి శిర మురమ్ము ♦ మోదుకొనుచు
నాకసమ్ము వగుల ♦ నార్చుచుఁ జనె ఖరుఁ, డున్నచోటి కలిమి ♦ యొరిమి సెడఁగ.

—♦ శూర్పణఖ మరల ఖరాసురుఁజేరి మొత్తుకొనుట ♦—

శా॥ నిర్యాతేపద, నార్ద్ర రక్తతలయై ♦ నిష్ఠ్యూతనేత్రాంబువై
నిర్యాసావిలసల్లకిం బెరయుచు ♦ న్నేరంబు లూహించు కా
దర్యం బాననమందు వ్రేలఁగ మహా ♦ దైత్యుండు వాఁ డాసభా
ధుర్యుండై కొలువుండు నయ్యెడ విని ♦ ర్ధూతాత్మయై వ్రాలిసన్. ౫౪

తే॥ వీక సెడి యున్న చెల్లెలి ♦ రాకఁ గాంచి, యేమిగతి గల్గె నేల యి ♦ ట్లేడ్చెదనిన
వారిదళఁ దెల్పియందఱ ♦ వలనుసూచి, ఘూర్ణమానాస్యయైపల్కెఁ ♦ గువలయాక్షి!

క॥ ఏరాణ సెడితి నని కా. దీరేడుజగమ్ము లేలు ♦ నీరాముఁడె పొం
డో రాక్షసులారా! యిఁకఁ, బోరున, నాతని జయింపఁ ♦ బోలునె మీకున్.

ఆ॥ రమణ నిచ్చటునఁ ది ♦ రమ్మయినాడు న, న్నిట్లుసేసె మీఁదఁ ♦ నెట్టు లగునొ
తొడరి వాని నింకఁ ♦ దోలెడువాఁ డొండు, గలఁడె యానపడకుఁ ♦ డిలను నిలువ.

శా॥ అయాసం బని యెంతు రేనిఁ జనుఁ డెం ♦ దైన న్సుఖం బబ్బుచో
నాయాస ల్విడనాడుఁ డొక్కట మహా ♦ న్నత్యంబు వాటిల్లునే
యాయుశ్శ్రీ లెడఁబాసి భర్త సన నే ♦ నోఁ గాదు నాకిమ్మెయిం
బ్రాయం బూరక పుచ్చి తుట్టతుదకుం ♦ బా లైతి నీచెట్టకున్. ౫౫

ఆ॥ ఒక్క మొగిన నెగసి ♦ యుఱికి యందఱు వారి, నఱికి ప్రోవులిడుఁడు ♦ నాదు మతము
గొంటిరేనిఁ బగఱ ♦ గొంటు మాయింపంగఁ, దలఁపరేని నిచటు ♦ దలఁగుఁ డిపుడె.

క॥ ఆతఁడు లంక సుఖించుచు, మీతల నిడినాడు నాదు ♦ మేళము నేఁ డి
ట్లై తలమున నిలకడ సెడఁ, బోతర మొనరించు బందె ♦ పో టొనఁగూడెన్. ౬౦

క॥ అని యారాటముతో నే, డ్చిన సోదరిఁ గాంచి యెట్లు ♦ సెల్లె రణ మ్మ
వ్వనిఁ దెలుపక మిన్నకె యి, ట్లనె దేమన నన్నతోడ ♦ నాసురి పలికెన్. ౬౧

ఉ॥ వచ్చిరి నాకుఁ దోడగుచు ♦ వాలుమగంటిమిఁ గ్రాలు శూలముల్
గ్రొచ్చిరి యన్నరేశునెద ♦ గొంటున నాతఁడు వానిఁ ద్రెంచి సం
విచ్చతురత్వ మేర్పడఁ బ ♦ విం బురుడించెడు నమ్ము లేయఁగాఁ
జచ్చిరి నీదు యోధులొక ♦ చర్చయుఁ గల్గెనె నే వచింపఁగన్. ౯౨

ఆ॥ ఎగిచిపడెడు వారి ♦ నెల్లర మంత్రించి, వైచినట్లు నేల ♦ పాలొనర్చు
మాయలాఁడు వాని♦మర్మ మే నరయంగఁ, జాలుదాననే ని ♦ శాచరేంద్ర. ౯౩

క॥ అన విని యాజ్యము వోసిన ననలుని క్రియ వాఁడు వెలిగి ♦ యనుజను గని యి
ట్లనె నింతమాత్రమునఁ బో యెనె వాఁడు కృతార్థుఁ డయ్యె ♦ నే చేర్పడఁగన్.

ఆ॥ ఖరుఁడు పనినఁ గాల ♦ గతులు దప్పిన నాఁటి, మాటగాక తెలివి ♦ మాలి నోరు
వగుల నేడ్వ నేమి ♦ పనివోయె నిపుడె యి, ల్లలికినంతఁ బండు ♦ వయ్యె ననెదె.

క॥ అని నుడివెడు నెఱితో న, య్యనదకుఁ జేవ యొదవించి ♦ యనుఁగులఁ గని చ
య్యన నాదగు స్యందనమును, ననువు పఱచి మీరుఁబయన♦మగుఁ డీకఁ బెలుచన్.

ఆ॥ పదియు నాల్గు వేల♦బలురథమ్ములవారు, నొక్కమొగిన తెగువ ♦ యుద్ధమునకుఁ
దరలవలయు నన్నఁడు♦దాత వానికిఁ దోడు, వచ్చునేనిఁ దలఁప♦వచ్చు నొకటి.

—♦ ఖరాసురుఁడు పదునాల్గువేల రథికులతో రామునిపై దాడివెడలుట ♦—

మహాస్రగ్ధర॥ అని యానం బాన నేయ♦న్వ్యవసితు లగుచున్ ♦యాతుధాను ల్మహాంబే
యను భావం బుల్లసిల్ల ♦ న్వ్యపగతభయులై ♦ యావదర్థ ప్రసక్తుల్
దనరార న్నేను నే ని ♦ త్తఱిఁ దఱిమెద ము ♦ త్తావులం గల్గు వీరుల్
గని ఘోరం దన్ను మిత్తిం ♦ గనినటు బెరలం ♦ గా నటం చాడికొంచున్. ౯౮

లయవిభాతి॥ అరదముల నొరసికొను ♦ ద్విరదముల రొదల కవ ♦ సరదముల మనని
మొన ♦ సరభసపు నుడులున్
బరగమన మరయనగుఁ♦బరఁగ మన మరసి యని♦ధర గదల నడచు భట♦వరతతి
కలనలున్
దరపవణడమరుకసు♦షిరపటహ మురజకము♦ఖరపటలపటురవణ♦భరభరితగతులున్
గర మొలసి యదితిజని♦కర మొడిచికొనఁ జను వి♦వర మొ యనఁ గరగతిక♦సుర
పదవి నఱుమన్. ౯౯

క॥ తరలిరి యోధు లమరులుం, దెరలిరి దితిజుల యదల్పుఁ ♦ దెంపును గని య
వ్వెరవునఁ దనయరదం బ, మ్మరుద్విరోధిపతి మెప్పు ♦ మైకొన నొప్పెన్. ౧౦౦

వ. స్వీయసేనాధినాథులగు దూషణుండును ద్రిశిరస్కుండును నమ్మేటి మన్నీని మన్ననలు వడసి తన్ను హెచ్చరించుచుఁ బన్నుగడలు మిన్ను ముట్టఁ బన్నించికొనిన తిన్నని తేరులఁ జేరుల నుగ్గడించి పంతమ్ములు నెఱపుచు నెలకొని నెలవుకొనఁ బురికొల్పు నపారమహాత్త్వవంబు డంబునకుం బునరుక్తిం బచరించు వందిజన జయోక్తినందోహంబులు గ్రందుకొన ఖరకరతేజుండు ఖరుండు సుమేరుశిఖరం బట్లు మణికాంచనభూషణభూషితంబై యవక్రహిరణ్మయచక్రంబును వైదూర్య కూబరంబును హాటకమణిరత్నకల్పితచంద్రసూర్యతారాగ్రహపుష్పద్రుమశైలనాగమత్స్యమృగపక్షిపాంచాలికాసమంచితంబును ధ్వజనిస్త్రింశవిరాజితంబును గింకిణీక్వణనసంపన్నంబును సమున్నతంబును సదశ్వయుక్తంబును నగు రథంబునుసామర్షుండగుచు నధిష్ఠించి యులతింబోని యమ్మేటివిలుకాండ్ర నెల్లరం దిలకించి దులకించు బీరంబు నఱసేయ కరుదెం డని యానతిసేయం దద్వాయుసహాయంబున నాయత్తంబై యుత్తలం బగు నాసైన్యపారావారంబు మీఱంబోలని చెలియలి కట్ట నెట్టన దూరంబున విడనాడి జనపదంబులు ముంపం బరతెంచెను నం జనస్థానంబుననుండి పొంగి పొరలి ముద్గరపట్టసశూలపరశ్వధఖడ్గచక్రతోమరశక్తిపరిఘగదాముసలవజ్రశరశరాసనంబుల వేరి మహామత్స్యగ్రాహాదియాదస్సంతతు లంతరంబు నిరంతరంబుం బొనరింప నయ్యరణ్యం బశరణ్యంబు గావించు వలనునం గానుపించుచు నేగుదెంచు నయ్యవసరంబున. ౧౦౧

క॥ పదునాల్గువేల రథములు, పదరి నడచుచుండ ఖరుని ♦ ప్రాంచద్రథ మ
య్యదనున నెఱిఁ గని సారథి, యద ల్పెసఁగఁ దీవె దివిచి ♦ న ల్లినయించెన్.

తే॥ శత్రు నెదిరించు ఖరు రథ♦చక్ర చంక్ర, మణమునం దోఁచి కడ లెల్ల♦మలసి వెలసె
వాన కారు మొగి ల్గుమి♦వలని రసిత, మట్టిఁ డగు నట్టి మ్రోఁత కాం♦తాఽవతంస.

క॥ అంతకుఁ డనఁగ ని యంత యొ, కింతయుఁ గొఱలేని దర్ప♦మెనయఁగ నొప్పెన్
యంతయు ననిలుఁడు ఘన మ, ట్లంతరమున నెయిద నెఱపె ♦ నాస్యందనమున్.

తే॥ అటు లనీకినితోడ దు♦ష్టాసురుండు, చటులతరసైన్యనాయక ♦ పటలితోడ
దూషణాదిప్రధానసం ♦ ఘుత్తుణంబు, దనరఁ దనరథ మొప్పారఁ ♦ దఱుమునపుడు.

—♦ ఖరునకు దుర్నిమిత్తంబులు దోఁచుట. ♦—

ఉ॥ ముందలఁ గొట్టె నట్టు లిల ♦ మొగ్గతిలంబడె యానయుగ్యముల్
పొందగు రాజమార్గమున ♦ బోరన నస్రము లొల్కు నస్రముల్
గ్రిందుగ నెట్టిడాలు గొని ♦ కందము లోలి స్రవించె నర్కునిన్
ముందుగఁ జుట్టె నప్పరిధి ♦ ము ప్పెటిఁగించుచుఁ గృష్ణరక్తమై. ౧౦౬

సీ॥ కాఁపురు గ్రమ్మె ది ♦ క్తటముల ధ్వజదండ, మెక్కె గ్రిద్ద కృతావ ♦ హేలనముగ
నాజనస్థానముం ♦ దంతట మాంసాద, మృగపక్షు లఱచుచు ♦ మెట్టఁ దొడరె
భైరవారావము ♦ ల్పరఁగించె వరళులు, మ్రాఁగెఁ గంకాదులు ♦ మొనలపైని
వీచికూచిధ్వను ♦ ల్వెడలించె శారిక, యుల్కలు తారల ♦ ట్లురలఁ దొడరె
పరిఘ మట్టి కబంధంబు ♦ భానుకెలనఁ, దోఁచె స్వర్భానుఁ డాతని ♦ నాఁచికొనియెఁ
బట్టపగలె యెఱ్ఱగ సంజ ♦ ముట్టఁ గదిసె, భూమి కంపించె నొకట నం ♦ భోరుహాక్షి!
తే॥ అదరె సవ్యభుజంబు గ ♦ ద్గదిక వొడమె, నశ్రుసంతతి కన్నుల ♦ నావరించె
ఫాలతలమున నట్టె గ ♦ న్పట్టె రుజయు, వాఁడు తలఁకఁడు మోహమో ♦ వస్తుగుణమొ

వ. తనతోడివాఁడై వాఁడి గలిగి మోడిగొని బీరమ్ము లాడుచుఁ గూడముట్టి దోఁ
తెంచు దూషణాఖ్యుం డగు నమ్మహామాత్యుండును వానిపిఱుంద నరుదెంచు
మహాకపాలస్థూలాక్షప్రమాథిత్రిశిరస్కు లను నలువురు సేనాధిపతులును నెల్ల
కడలం దామయై యేమెయి నేనిం దనయిమ్ము వాయని మేలుకోలున మేలుకోరి
పఱతెంచు శ్యేనగామియుఁ బృథుగ్రీవుండును యజ్ఞశత్రుండును విహంగముండును
దుర్జయుండును గరవీరాక్షుండును బరుషుండును గాలకార్ముకుండును మేఘమా
లియు మహామాలియు సర్పాస్యుండును రుధిరాశనుండును నను పండ్రెండుగురు
దండనాయకులును రోమహర్షణకరంబు లగు నచ్చెడుంగు నినాదంబుల నిదా
నించుచుండ నందఱం గలయం గనుంగొని కనుంగొనల నవ్వు దొనుకాడ నోడ
రాని దిట్టఁతనంబున మనంబున నెట్టన గట్టిసేసికొని సోఁకుమూఁకలఱేఁడు మేకొను
చలమ్మునఁ బ్రాఁకువెట్టుచు నిట్లనియె, ౧౦౯

—♦ ఖరుఁడు మంత్రులతో బీరము లాడుట ♦—

శా॥ ఏఁ జర్చింతునె దుర్బలమ్ముల బల ♦ మ్మే లేని సన్న్యాసి యి
య్యాజ న్నెక్కొనఁ గాక కాలజము లె ♦ ట్లో తోఁచు లోపించునే
యాజి న్నేనె జయింతు నం చెఱుఁగరే ♦ యా దేవరా జుల్క నీ
రాజా, లెక్కకు వచ్చువాఁడు కునరు ♦ ప్రారాఁపు సైరింతురే. ౧౧౦

ఆ॥ మిత్తి గెల్తు నుడుల ♦ మేకొని రాల్తు నే, హుంకరింప రుద్రుఁ ♦ డురు వడంగి
పోవు ననఁగ నిట్టి ♦ పురుషులు నా కు ప, దంశకముల యింత ♦ దలఁప నేల. ౧౧౧

తే॥ అని నెఱపు వాని గర్జల ♦ నవధరించి, పొంగె రాక్షసవాహిని ♦ భోరుకొనుచుఁ
గాల మాసన్నమైన నొ ♦ క్కండు దలఁప, వచ్చునే కీడు మే లంచు ♦ వరగుణాఢ్య!
తే॥ తపిలి బ్రహ్మర్షి దేవగం ♦ ధర్వసిద్ధ, చారణప్రముఖులు త ♦ త్ప్రచార మరసి
యంబరంబునఁ జేరి య ♦ ట్లనుకొనంగ, దొడరి రురుసుకృతము లెంచి ♦ ధూతకలుష.

